...మవతీపరిణయనాటకము.

ఇది

మోరిగ్రామవాస్తవ్యుఁడగు

చింతా వీరభద్రయ్యచే

రచింపఁబడి

పిచ్చిక మల్లయ్యగారి

ధనసాహాయ్యమున

కాకినాడ సిటీ ముద్రాక్షరశాలయందు ముద్రించి

ప్రకటింపఁబడినది.

ప్రథమముద్రణము 1000 ప్రతులు.

1922

పిచ్చిక మల్లయ్యగారు.



మ॥ ధరశ్రీపిచ్చిక వంశవారిధిసుధాధాముండు సుశ్లోకుఁడున్
బరమోదారుఁడు వీరభద్రసుతుఁడున్ భవ్యాత్ముఁడున్ మార సం
హరభక్తుండును నైన మల్లయసమాఖ్యుం బొల్చునార్యుండు స
త్కరుణం జాలెడు సంతతద్రవ్యమిడె మద్గ్రంథంబు ముద్రింపఁగన్॥

గ్రంథకర్త.



గ్రంధకర్త, చింతా వీరభద్రయ్యా.

# పీఠిక.

ఆర్యవర్యులారా!

నేను మున్ను ౘంద్రికాంతానాటకమును రచించిపిమ్మట మత్సుహృద్వరుల ప్రోత్సాహమున స్కాందపురాణాంతర్గత శివరహస్య ఖండమునఁ గల శూరపద్మాసుర చరిత్రము మూఁడుభాగములుగనుఁ గాఁ బ్రథమభాగ మిందారణ్యవాసముగను, ద్వితీయభాగము హైమవతీపరిణయముగను, తృతీయభాగము కుమారవిజయముగను విభజించి నాటకములుగాఁ జేయ నుద్యమించి ప్రథమభాగమగు నిందారణ్యవాసము నింతకుఁ బూర్వము నాటకము (డ్రామా) గాను, యక్షగానము [వీధినాటకము] గాను గల్పించి నాటకము [డ్రామా] గా మాత్ర మచ్చువేయించితిని. కాని నాహితులు కొందఱు యక్షగానముగాఁ గూడ ముద్రింపించుమని నన్నుఁ బురికొల్పిరి. కాని ద్రవ్యలోపముచే నే నట్లు చేయలేకపోయితిని.

ఇప్పుడే తచ్చరిత్రంబున ద్వితీయభాగమగు నీహైమవతీపరిణయముఁ గూడ ద్వివిధప్రదర్శ నానుకూలముగ వ్రాసి మానాటకసమాజమువారిచే "డ్రామా"గాఁ బ్రదర్శింపించితిని దానిని దిలకించిన మన్మిత్రబృందములో శ్రీమద్దేవాంగకుల శిరోభూషణులును, పిచ్చికవంశవారిధిరాకాసుధాకరులును, నగు మల్లయ్యగారు సంతోషితస్వాంతులయి నన్ను మఱునాటి దినమునఁ బిలిపించి నాటకరచనకు నన్నెంతయుఁ గొనియాడి, ద్వివిధముగా సిద్ధముచేసిన యీనాటకము రెండుతెగలవారికి నుపయోగించునటుల నొకే ప్రతిగా నచ్చొత్తించుమనియు నందులకయ్యెడు ద్రవ్యము నొసంగెదననియు నాకు వాగ్దానమిచ్చుటచేఁ బర

పానందహృదయుఁడనై యుండుల కంగీకరించి, కీర్తనలు గీతార్థ
బోధములుఁ జేర్చి యీ యంకములుగ నేర్పఱచిన యీనాటకములో న
కములకుఁ జూపుంచక యక్షగానముగ ముద్రింపించితిని. దీనిని వీక్ష
టకముగ నాడువారు యథావిధిగ వల్లించి యాడుకొనవచ్చును. గా
"చారిత్ర"గా నాడువారు మాత్రమిందలి దరువులు, గీతార్థకంద
ములు విడిచి మిగిలిన గ్రంథము పఠించుకొనవచ్చును. ఇట్లు తగ్గించి
ల్లించినందునఁ గథా సరణి కేమియు లోపముండదు. కావునఁ బ్రద
కుల కేదియిష్టమో యట్లువల్లించి నాటకము లాడుకొనవచ్చును.

మఱియు, నల్పజ్ఞుండనగు నాచే రచింపఁబడిన యీ కావ్యము
లోనను లెన్నియున్నను సరసించి నీరములఁ బరిత్యజించి క్షీరములఁ గ్రో
లు మరాళములకైవడి గుణగ్రహణపారీణులగు పండితవర్యులిందలి
ణములనే పరిగ్రహించెదరని పరిపరివిధములఁ బ్రార్థించెద.

మఱియు మద్గ్రంథమును శ్రద్ధవహించి శ్రమముసకు సహి
ంచి యొత్తివ్రాసి యిచ్చిన మత్ప్రియ మిత్రులగు బ్రహ్మశ్రీ గోపరా
వేంకటాచలపతిరావుగారిని, ధనమునకు వెనుదీయక నా పొత్తము
చ్ఛొత్తింప సాహసించిన దివ్యాంగ శ్రీపిచ్చిక మల్లయ్యగారిని నంప
న్నాయురారోగ్యసంకలితులఁ జేసి సర్వదా నంరక్షించుచుండుటకు సర్వే
రున కనేక వందనము లాచరించెద.

మోరి.
౧౦-౧౦-౨౧.

ఇట్లు బుధవిధేయుఁడు,
చింతా వీరభద్రయ్య.



ఓమ్.

శ్రీ సర్వేశ్వరాయనమః

## ఇష్టదేవతా ప్రార్థనాదికము.

శ్రీ నగజాత తన్ను బతిఁ జేసికొనం దపియింప వృద్ధుఁడై
మానినిఁ జేరి "శంకరుఁ డమాన్యుఁడు, మాన్యుఁడ నే వరింపు మో
చాన!" యనం గడుంగినియఁ జయ్యన బూర్వపురూపుఁ జూపి యా
మేనకకూఁతు కేలుగొని మీఱెడు శంభుఁడు మమ్ముఁ బ్రోవుతన్

గీ. బాల్యమునుండి భక్తిమైఁ బరమనిష్ఠ
దపముసేయుచుఁ బరులబోధనల వినక
పర్ణశాలను వసియించి పరమశివుని
బతిగఁ బడసిన సతి మమ్ము సతతమేలు.

గీ. క్షితిని బ్రతిభాద్రపదమాససిత చతుర్థి
భక్తులర్పించు నుండ్రముల్ పాయసంబుఁ
గుక్షి నిండార భక్షించి కుతుకమందు
విఘ్ననాథుని గొల్తు నవిఘ్నమునకు.

క. వాణిని సంతత నతగీ
ర్వాణిని నలివేణి బ్రహ్మరాణిన్ వీణా
గానవినోదినిఁ బుస్తక
పాణిని వాక్పటిమకొఱకుఁ బ్రార్థింతు నెదన్.

గీ. పూర్వము కవిత్వమహిమలఁ బూజ్యులైన
యట్టి నన్నయభట్టుఁ దిక్కన్న శంభు
దాసు బమ్మెర పోతనాద్యఖిలసుకవి
వరుల నెన్నెద మత్కృతి వరలుకొఱకు,

ఆ. వె. పిన్నతండ్రియయ్యుఁ బిన్ననాఁటంగోలెఁ
గరఁణాంధ్రవిద్యఁ గఱపినట్టి
యస్మదీయగురుని నార్యుఁ జింతా మల్లి
ఖార్జునాఖ్యునెడఁద నభినుతింతు.

క. ఆర్యుని యూణ్ణి యనంతా
చార్యుని బండితవరేణ్యు సంగీతకళా
ధుర్యుని సన్మద్దేశిక
వర్యుని మృదుపాదయుగము వదలక గొలుతుఁ.

అని యిట్లభ్యుదయపరంపరాభివృద్ధికై యిష్టదేవతాప్రార్థనం
బును సత్కవి సంస్తోత్రంబు గురుజనవందనంబును గావించి

గీ. గిరిసుతాధీశు లోకేశుఁ గృత్తివాసు
బుధజనోల్లాసు నఘనాశుఁ బురవినాశు
నిలను మోరి నివేశు సర్వేశు నాదు
విమలహృదయారవిందపీఠమున నిలిపి

సీ. నవమాసములు మోసి నన్నుఁగని పెంచిన
జనయిత్రికాది నంజలిఘటించి
కరుణార్ద్రహృదయుఁడై కాచిరక్షించిన
జనకునకును నమస్కారము నిడి
విద్యాప్రదానంబు వేడ్కనాకొసఁగిన
సద్గురువర్యుల సన్నుతించి
యనిశంబు నాక్షేమమారయుచుండెడు
సత్తమామల మదినభినుతించి
బంధుజనములకెల్లను బ్రణుతిఁజేసి
మిత్రవర్యులఁగొనియాడి మిహికశేఖర

కన్యకోద్వాహకథ నాటకంబుగాఁగఁ
గూర్పఁగడఁగితి సజ్జనుల్ కుతుకమొంద.

షష్ఠ్యంతములు.

క. శంకరునకు సురవైరిభ
యంకరునకు ఘోరపాపహరునకుఁ బురనా
శంకరునకు భక్తజనవ
శంకరునకు మోరినగర సర్వేశునకున్

క. గంగాధరునకు ధృతసా
రంగునకున్ వృషభరాట్తురంగునకున్ భ
స్మాంగునకు భూరికరుణా
పాంగునకున్ మోరిపట్టణాధీశునకున్

క. శర్వునకు దుష్టదానవ
గర్వవిదారునకు శీతకరధారునకున్
గీర్వాణవినుతునకు శ్రీ
సర్వేశ్వరునకును మోరిసంస్థానునకున్.

క. హరునకు దక్షాధ్వరసం
హరునకు సంతతమదాపహారునకు గంగా
ధరునకు హిమశైలసుతా
వరునకు శ్రీమోరినగరవాస్తవ్యునకున్.

క. ఈశునకు భక్తపాపవి
నాశునకిభచర్మ వసనునకు నతగీర్వా
ణేశునకుఁ బార్వతీహృద
యేశునకున్ మోరిపట్టణేంధరునకున్.

అంకితముగా నా యొనర్పఁబూనిన నాటకమును సమర్పించితిని.

శ్రీ

# హైమవతీపరిణయనాటకము.

[నాంది]

వ. సనకసనందనాదిమునిసంఘముగొల్వ వటద్రుమూలమం
దునఁ దపియించుచుఁ మరునితూపుల ధాటికిఁ దాళలేక సం
జనితవిమోహతాపమున జాయగ హైమవతీసతీమణిం
గొని సుఖియించు శంకరుఁడు గొబ్బుననీవుత మీకుసౌఖ్యముల్.

మఱియు

గీ. తల్లిదండ్రులు బంధువులెల్ల జనము
అచ్చెరువువందఁ బరమనిష్ఠాత్మయగుచు
భక్తిఁ దపియించి శంభునిభర్తగాఁగఁ
గొనిన హైమవతీసతి మనుచుమిమ్ము.

(సూత్రధారుఁడుప్రవేశించి సభ్యులపైఁబుష్పములఁ జల్లి)

సూత్ర—ఏమది? పారిపార్శ్వకుఁ డింకను నాలస్యముచేయుచున్నాఁడు

పారి—లేదులేదు బావా! వచ్చుచున్నాను (ప్రవేశించి) ఏమిసెలవు?

సూత్ర—మిత్రమా! నిఖిలవిద్యావిశారదులగు సీసభాసదులు నన్నుఁ జేరి యీరేయి హైమవతీపరిణయనాటకమును బ్రదర్శించి మమ్మానందితుఁజేయవలెనని నాకానతిచ్చినారు కావున నీవుకూడ నాకించుకతోడ్పడెదవని నిన్నుఁ బిలిచితిని.

పారి—బావా! యీనాటకము రచియించిన కవియెవరు?

సూత్ర—ఎఱుఁగవా? ఇంతకుమున్ను చంద్రకాంతనాటకమును శ
పద్మాసురచరిత్రంబునఁ బ్రథమభాగమగు నిందారణ్యవాస నా
కంబును రచియించిన కవియే దీనిని దచ్చరితంబున ద్వితీయభా
ఁబుగ రచియించినాఁడు.

పారి—ఆకవితిలకుని కులగోత్రములు వక్కాణింపరైతి రేమి?

సూత్ర—ఇదిగోఁ జెప్పెద నాకర్ణింపుము.

సీ. వసుధ శ్రీదేవాంగ వంశదీపకుఁడు కా
త్యాయనసూత్ర విఖ్యాతుఁడమల
గుణుఁడుపతంజలి గోత్రపవిత్రుండు
చింతాన్వయాంబుధిశీతకరుఁడు
వరమహాదేవ ప్రపౌత్రుండు చినవీర
భద్రాహ్వయునకు సత్పౌత్రవరుఁడు
పావని నాగమాంబకు సుబ్బరాయున
కావిర్భవించిన యగ్రసుతుఁడు
రహిని శ్రీనాగలింగయ రామలింగ
యాఖ్యులకుఁ బూర్వజుండు జనానురక్తుఁ
డగుచు విలసిల్లు వీరభద్రాహ్వయుండు
దీనిని రచియించెను జగద్విదితముగను.

పారి—ఓహో! వీరభద్రకవియా? ఔ నీయననాటకములు ప్రదర్శ
నుకూలములని నేనిదివఱకే వినియున్నాఁడను. అందుచేతనే సభ్యు
కూడ నాయన గ్రంథమునే ప్రదర్శింప మనకాజ్ఞాపించినారు.

సూత్ర—ఔనదినిజమే కాని యీకవివిబుధవర్యులకు వినయపూ
కముగ నిట్లు విన్నవింపుమని నాకాజ్ఞాపించినాఁడు.

. చదువఁగలేదు కావ్యములు శాస్త్రనిబంధనలే నెఱుంగనా
మదికిస్ఫురించినట్లిటుల మార్చితినీకథ నాటకంబుగా
బుధవరులార! యీకృతిని బూర్తిగఁజూచి తృణీకరింపకే
విధమగుదోషముండినను బ్రీతిక్షమించి సమాదరింపుఁడీ''

—బావా! యెంతవిద్యావంతుఁడేనియుఁ బండితవర్యులకు లోనుగా
క ప్రగల్భములు వచించునా? అది విద్వద్ధర్మమా?

(తెరలో)

నరగునవిద్యనేర్చి, సురసాతనుజత్రియమిాశుఁ గూర్చి, దు
ష్కరమగు వీరయాగమునుసల్పి, వరంబులఁ గొన్నదాతిగా
సురతతినీచకృత్యములఁ జొన్పి, తరింపఁగరాని దుఃఖసా
గరమునదింప, కాంతలను గారలనుంచుట మీారెఱుంగరే?

త్రి—(ఆలకించి) మిత్రమా! శూరపద్మదానవబాధితుఁడగు మ
హేంద్రుఁడు రాక్షసనాశనార్థము తగిన యోజన సేయుఁడని బ్రహ్మ
విష్ణులతో 'నేమేమియో చెప్పుకొనుచున్నాఁడు. కావున మనమిటఁ
బడయవలదు రమ్ము పోదము.

—చిత్తము. (ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.



శ్రీ

# హైమవతీపరిణయనాటకము.

[మేరుపర్వతమున బ్రహ్మవిష్ణుమహేంద్రుల ప్రవేశము]

దరువు. ఆదితాళము. సావేరి.

సభ చేసిరి ధర్మాద్రినిఁ బ్రహ్మవిష్ణుజిష్ణులు ॥స॥
సభ చేసి రసురవరులఁ జక్కాడుమార్గ మరయ
శుభముహూర్తంబున సురసంఘములతోడ ॥స॥
అరివర్గ మిడెడుబాధకు సహింపలేక యనవరతంబు వంతకు
నిరవైతి మింక మనుట కెయ్యది మార్గమనుచుఁ
బరిపరివిధముల భావించుకొనుటకు ॥స॥
చెఱలలోఁగుందుచుండిన సురసంఘములను
జెఱలఁదొలఁగింపఁగొబ్బున
ధరణి శ్రీమీఱినగరధాముఁడై పట్టి సర్వే
శ్వరుని దలంచి మిగుల సౌఖ్యముఁ బడయుటకు ॥స॥

దే.—గోవిందశతానందులారా!

చ. వరగుణ విద్య నేర్చి, సురసాతనుజత్రియ మీఁకుఁ గూర్చి దు
ష్కర మగువీరయాగమును సల్పి, వరంబులఁ గొన్న దాదిగా,
సురతతి నీచకృత్యములఁ జొన్పి, తరింపఁగరాని దుఃఖసా
గరమున ముంచి, కాంతలను గాఱల నుంచుట మీ రెఱుంగరే?

బ్ర.—మాకే కాదు. దివౌకసులెల్లరకు నిది యనుభవసిద్ధమే.

వి.—మహానుభావుఁడు శంకరుఁడొక్కఁడే రాక్షసుల కతీతుఁడై యున్న

వాఁడు.

దేవేం.—ఇట్లుండఁ గొంత కాలమునకు శూరపద్మాఁడు మోహావేశమున
మత్సతిని వరించి బలాత్కారముగ నామెం దోడితెచ్చుటకు సేనా
నాయకున కాజ్ఞాపింపఁ దద్వృత్తము నారదునివలన నే నెఱింగి గురు
వాక్యపరిహారంబుగ శ్రీకాళపరిసరారణ్యముఁ జేరి యందు మహా
కాళునిచెంగట నాప్రియురాలిం దిగవిడిచి శూరపద్మాసురవధార్థ
మై శంకరుని బ్రార్థింపఁ గైలాసంబున కరిగితిని. అట్టియెడ శూర
సోదరియగు నజముఖి మన్నారికడ కేతెంచి తాను చెప్పినచొప్పున
నొప్పమికిఁ గినిసి కొప్పుముడిఁ బట్టి యీడ్చుచుండఁ దత్పతీపాలకుం
డజవక్త్రకరంబు ఖండించి పులోమజం గాపాడె. అదియుఁ గలహ
భోజనుండునాకుఁ గైలాసంబున నెఱింగింపఁ జింతాక్రాంతచిత్తుండ
నై రాక్షసాధములకు వెఱచి యాతురతతో శ్రీకాళోపవనంబున ను
న్నరాకేందువదనను మహాకాళానుమతంబున నీనగరంబునకుఁ దోడి
తెచ్చితిని.

దరువు రూపకము. అసావేరి.

ఇంతకష్ట మాపహిల్లె నెట్లు మనుదు నకటకటా!
అంతకంత కసురబాధ లతిశయిల్లు చుండెఁ గటా ॥ఇంత॥
పంతంబున మమ్ముఁ బట్ట భావించెను దైత్యుఁ డంచుఁ
గాంతాసహితుండ నగుచుఁ గందరమున వసియించితి ॥ఇంత॥
పురము వీడి చిరకాలముఁ దురపిల్లుచు నుంటిఁ గాని
దురితుని నాశూరపద్ముఁ దునుమాడఁగ లేకపోతి ॥ఇంత॥
నిరతముఁ జారులను బంచి వెదకించుచు నుండె వాఁడు
ధరణిలో శ్రీమోహినగరధాముఁడు కరుణింప వాఁడు ॥ఇంత॥

వ. పురమును వీడి, గాటమగు పూర్వానురాగవేళ బాధ కోడి, సం
గర మొనరింపఁ బౌరుషము గల్గమిఁ కే మదిఁ భీకులాడి, యీ
శరణిని గాంచనాద్రిపయిఁ గాఁపుర ముంటిని జేడెఁ కాడి, యో
మురహార! నీరజాసన! మిమ్ముం గొనియాడద నాదరింపుఁడీ.

దుష్టరాక్షసశిక్షణంబును గష్టపారావారతరణంబును గావింప మాకు మీరే గతి యని మిమ్ముఁ బ్రార్థించెద. శీఘ్రి మనుగ్రహింపుఁడు.

విష్ణు—మహేంద్రా! శూరపద్మశబ్దగతశ్రోత్రపుటాండమై భయమున నొవలుగంపిల్ల నీమేరుగిరికి వచ్చి వ్యస్థతపడుచుకొనుచుండెదు నేనా యాచండశాసనుని ఖండింపఁగలవాఁడను.

గీ. జగతిఁగలసర్వవృత్తముల్ సంగ్రహించి
యప్పుడప్పుడు చనుచు నేవతనియొద్దఁ
జెప్పునట్టుల నన్ను శాసించినాఁడు
ఏమి చెప్పుదు నాపాటు లిందిర్! నీకు.

మీకు వినిపమాత్రింబున భయసంచలితాంతరంగుండగు నీభీరుడాశూరునితో నేతీరునఁ బ్రసంగింపనోపునో యని శంకయించుచుంటివేమో! కాని నేనాద్రైత్యశాసనోల్లంఘనాశక్తుండ నగుటయే దీనికి ముఖ్యకారణము.

దేవేం—గోవిందా! నీవే యీచందమున వాకృచ్చుచుండిన నాదెందము మఱెంత కొందలమున కవకాశ మీయకుండునా?

సీ. మత్స్యరూపమున సోమకుఁ బీచ మడఁగించి
వేధ కీయవె చతుర్వేదములను
కూర్మరూపంబునఁ గుధరంబు దేలించి
తెంబు నిడవె సర్వామృతములకుఁ

గిరిరూపమున మహోత్కటుఁ డైనకనకాక్షుఁ
గెడపి పృథ్వీభార మడఁప లేదె
నరసింహరూపము ధరియించి కనకక
శ్యపుఁ గూల్చి ప్రహ్లాదు సాఁక లేదె
యట్టికీరుండ వీ సురసాత్మజులను
వృద్ధియోరూపమును దాల్చి యేఁ పఱంచి
యస్మదాదినిలింపుల యార్తి దీర్చి
యశము నొందక నీ విట్లు లాఁడఁ దగునె?

మఱియు భువనహితార్థమై వెలయుచుండిన భవదీయ దివ్యావతారంబులు వర్ణింప నెంతవాఁడను. లోకరక్షాపరాయణుండవును కృపాంభోరాశియు నగు నీవే మాయాపదలఁ గడువం బెట్టువాఁడవు కావున నీవిషయమైకూడఁ గొంతశ్రమముఁ బూన వలయును.

విష్ణు—పురందరా!

క. శూరుని సోమకుఁ గూల్చితి
ధీరత మందరము జలధిఁ దేల్చితి, ననిలో
దారుణదితిజులఁ జంపితి
శూరాదుల నెదుర గుండె నుడివడుచుండున్.

అదేమిహేతువో కాని యాదుర్మదాంధుని దలంచినపుడెల్ల నాకస్మికముగ హృదయము భేదిల్లి యొకటి రెండు యామములవఱకు నెమ్మదిఁ బొంద కుండును.

బృహస్పతి—మాధవా! నీకే కాదు నిరంతర మాదుష్టాత్ముని సభాభ్యంతరమునఁ బంచాంగముఁ జెప్పుచు నిచ్చకపుమాటలచేఁ బ్రొద్దుపుచ్చుచుండిన నాకుసహిత మాశూరుని భీకరాకారము గన్నులారఁ గాంచినపుడెల్ల గుండె గుభిల్లునఁ గొట్టుకొను చుండును. అందువలన

నే కదా నే నాతనిసదనముచ కరుగుట మాని యీసుధరమునకు వచ్చుచుండినది?

వేం—(తనలో) అయ్యో! యీవిధువిధాతలుసహితము శూరపద్మ ని పరాక్రమంబునకు వెఱచి తమతమ యసమర్థత్వంబులు వెల్ల డించుకొను చున్నారు. ఇఁక నెట్లో కదా! (ప్రకాశముగా)

సంవాదదరువు. ఆది తీల్వా

బ్రహ్మవిష్ణులారా! మీరీగతిఁ బల్కిన నేనెటు తాళుదు హా!
బ్రహ్మాండంబుల నేలుచు దివిజుల బాధించుచు రిపుఁ డొప్పెనుగా॥

బ్రహ్మ—శౌర్యసంపదలు నెలకొని యెుకచో సతతం బుంకునె సురనా
థా- క్రొవ్వ మడంగఁనుగర్వము తొలఁగునుగాంచుచు నుం
డుమువిడిచి వ్యథ ॥—॥

వేం—గడియ యుగంబుగఁ దోఁచుచు నుండెను ఖండింపుఁడు శూరా
ధమునిక - దడసినకోలఁదిని మీఱుచు నుండెను దానవబా
ధలు లోకములక ॥—॥

ష్ణు—శూరునిదాడికిమాదోర్బలములు శుష్కతఁజెందెనుమచికుండా
ధారుణిమోరిపురీశుఁడె మనలనుదయజూచునుమానుముగుంద ॥-

వేం—కమలాతత్కమలాసనులారా!

. ఘనులౌయోజనశాలురంచు సరిసంఘుంబు నిర్విదారింతురం
చునునామానసమందు నెంచి మిము సంస్తోత్రింబుగావించుసక
గనిరక్షింపక మేమె యారిపులచేఁ గాసిల్లుచున్నారమం
చును వాక్రుచ్చితిరెంత కాలమిటు సంక్షోభంబులోనుందుమా!

మీరారాతిఁ దించరనిగ్రహంబు గావింపనిచో వారు సంహారిం పఁ బడునుపాయంబైనశైలంబ యోచించినాకెతెంగింపుఁడు. అల్లొన ర్పకుండిన మేరుగిరివినిర్గమనంబును స్వర్గపుర ప్రవేశంబును నాకు లభించుట బహుదుర్ఘటము.

విష్ణు—పాకశాసనా! నేనొకటి చెప్పెద నాకర్ణింపుము.

ఆ. వె. వాఁడుమీఱి నిర్జరావళి బాధించు
పాపకర్ముఁ డింక బ్రదుకఁ జేరు
సస్యనాశనంబు సలిపెడి శలభసం
ఘంబులొక్కతఱిని గడచుఁగాదె.

ఎంతపరాక్రమోన్నతునకేని దుష్టపథానువర్తనము వంశచ్చే
దనముచేయక వ్యర్థముగ విడువదనుకొనుము.

బ్రహ్మ—మహేంద్రా! గోవిందుని వాక్యము లనుభవసిద్ధములే. ఇట
విను.

గీ. ఎందఱెందఱో రాక్షసులేపుమీఱి
యుష్మదాదినిలింపుల యుక్కడాల్చి
హరునివలననో యీచక్రిధరువలననో
కడకుహతులౌటఁ గనులారఁ గాంచలేదె!

ఈతారకాదులకుఁ గూడ నదియే గతిపట్టినది కావునఁ గొంతక
లము ధైర్యధురంధరుఁడవుకమ్ము.

దేవేం—(ఏదియో యాలకించుట నభినయించి) మాధవా! ఆదెన నె
యో ధ్వని వినవచ్చుచున్నది. ఆలకింపుము!

విష్ణు—(ఆలకించి) పురందరా! అది నారదుని వీణాధ్వనివలె వినఁబ
చున్నది.

బ్రహ్మ—అవును నాకుమారుఁడు నారదుఁడే హరినామసంకీర్తనము
యుచు మనదెసకు వచ్చుచున్నాడు.

దేవేం—ఓహో! మహానుభావుఁడాతఁడుకూడ సమయమునకు వచ్చు
చున్నాఁడు. ఇఁక నేమికావలయును?

(అంత నారదుఁడు ప్రవేశించును)

దరువు. ఆది- దేశీయతోడి.

ారాయణ గోవింద మురాంతక నళిననేత్ర నీలాభ్రగాత్ర హరి ॥నా॥
ారదగృహప్రియవరకరుణాకర సర్వమానిమానసనిలయా హరి ॥నా॥
.రసనిత్యాతిశయన పరాత్పర క్షితిభృద్ధర వైకుంఠవాస హరి ॥నా॥
ారుణదుష్టవిదార కలుషహర ధారుణి మోహిపురీశమిత్ర హరి ॥నా॥

.వేం—(నారదునకెదురేగి)

క. మునికులతిలకా! నీపద
వనజములకుఁ జేతుఁ గొనుఁడు వందనశతముల్
ా— ఘనకాంచనభూషణవా
హనసుతపౌత్రాభివృద్ధి యగు నీకింద్రా.

.వేం—ఈనిర్భాగ్యున కాదరి మరలఁ జనుదెంచునా?

ా—ఏతెంచక యూరీతినేపోవునా? కొంచెమోపికఁబూనియుండుఁడు (బ్రహ్మవిష్ణులఁ గాంచి) ఓహో! మాతండ్రి బ్రహ్మదేవుఁడును గూడ నిచ్చటనేయున్నవాఁడు (సమీపించి)

గీ. జనక! భవదీయమృదుపాదజలజములకు
వందనం బాచరించెద వాంఛమీఱ
.)— పుత్రకా! చిరజీవివై భువనములను
బూజనీయుండవై కీర్తి పొందఁ గలవు.

ా—(విష్ణునిజూచి)

గీ. పుండరీకాక్ష! మీపాదపుండరీక
ములకు నభివాదనము చేతు మోద మలర
.— నారదా! గానవిద్యావిశారదుండ
వగుచు నెల్లెడ గౌరవం బందఁ గలవు.

.బ్రహ్మ—కుమారా! యిట వచ్చి కూరుచుండుము.

నార—[కూర్చుండును]

విష్ణు—మునిసత్తమా! యిప్పు డెచ్చటనుండి యిచ్చటకు విచ్చేసితివి?

నార—వీరమాహేంద్రపురమునుండి వచ్చితిని.

దేవేం—అచ్చటఁగొత్త వృత్తాంతము లెవ్వియేని విన్నచో వాక్రుచ్చ

వేఁడుచున్నాఁడ.

నార—[తనలో] ఈమహేంద్రునకుఁ గారాగార బద్ధుఁడైన జయంత

కుమారుని వర్తమాన మెఱింగించినచో నసంత చింతాకులస్వాంత

డై సంతతముఁ బరితపింపక మానఁడు. అయ్యో! నేనీతని కిప్పుడున

సంతాపకర సమాచారములే చెప్పుచు మఱింత దుఃఖమును గూ

ర్చుచున్నాఁడను ఇప్పుడిది చెప్పుమునా? మానుదునా? [యోచించి

అవును చెప్పిన నీబ్రహ్మవిష్ణులుండఁగనే చెప్పవలయును. అదివి

నతోడనే వీరందఱు నసురనాశనార్థమీశ్వరుని బ్రత్యక్షముగావి

చుకొని యాతనివలన నుగ్రవరంబులఁ బడసి నిరాయాసంబుగ

శూరాదుల మదం బడంపక మానరు. అప్పుడుగాని నాకడుపుబ్బు

రోగము సర్వమునివారణముకాదు. కావున ముఖ్యముగ నెఱిఁగి

చెద. [ప్రకాశముగా] మహేంద్రా! నీకా యసురపుర సమాచా

మేమని విన్నవింతును?

దేవేం—[తనలో] అయ్యో! యేమిది యీనారదుఁడిట్లనుచున్న వాఁడు

[ప్రకాశముగా] మునీంద్రా! ఆశూరుఁడు మరల నేదేని దుష్కృ

త్యమాచరింప నూహించుచున్నాఁడా యేమి?

సంవాదదరువు. ఆది తాళి

మునివర్య దైత్యపురమున విన్న సమాచార

మును దెల్పుఁడు సత్వరమున విందు సుగుణాకర ముని

నార—అమరేశ్వర తద్వార్త యాలకింప నంతత

కుటిలతదుఃఖముచేతఁ గుములుచుండుటిదిస్వాంతము ॥ముమ॥

దేవేం—అంతదుఃఖాస్పద మైనవార్త నారద
మునితెల్పుఁడపెద నేల వావు నిచ్చరాదా ॥ముని॥

నార—తెలుపనెంచినసంగతి తెలి పెదవిను సురపతి
యిలలోన మోహిశతి గలుఁడె దీనికిగతి ॥యమ॥

మహేంద్రా! పులోమజా గవేషణార్థము శ్రీకాళహస్తిన నారణ్యమునకేతెంచిన మేషవక్త్రి మహాకాళునిచే గతవాస్తవమైన వృత్తాంతము తమ కెఱింగినదేకదా!

దేవేం—అవును. మీరేనాకది కైలాసమునఁ దెలియఁజేసితిరి.

విష్ణు—నారదా! ఆయజముఖి మరలనేదేనిఁ గపటమాచరింపనెంచినదా యేమి?

బ్రహ్మ—ఆదురాత్మురాలేది తలంచిన నది నిరాఘాటముగ నెఱవేర్చితీరును.

దేవేం—మునికులోత్తమా! ఆమేషముఖి తరువాతనేమిచేసినది?

నార—తరువాత నాశూరానుజ రోదసీకుహరము వగుల రోదనముసేయుచు వింధ్యాగ్రంబుననున్న శూరపద్మాసురునకీ వృత్తాంతమెఱింగించి రాక్షసానీకమునకుఁ జాతుమంబాదవింపఁ బొరలి పొరలి యేడువసాగినది.

దేవేం—ఓహో! పాపిష్ఠురాలజముఖి యెంతపనిచేసినది?

విష్ణు—ఎంతపనిచేసినదోయన నేల? అగ్నిపై జెయ్యిగా నాజ్యముపోసినది.

బ్రహ్మ—అంతే కాదు. కోపాగ్నిపై గుగ్గిలపుపొడి కూడఁ జల్లినది.

దేవేం—నారదా! అనంతర మా శూరపద్ముఁ డేమి చేసెను?

నార—ఏమిచేసెనా? చెప్పెద వినుఁడు.

ఉ. శూరుఁడు భ్రాతృదుఃఖమునుజూచి సహింపఁగలేక, సిన్నుసీ
దారనుబట్టితెమ్మనుచుఁ దక్షణమాత్మభటాళిఁ బంపనాతఁడుఁ

ధీరత సర్వలోకములు ద్రిమ్మరికన్గానలేక స్వర్గముం

జేరి, భవత్కుమారకుని జెచ్చెఱం బోరనం బట్టి సేనతో.

దేవేం—[విచారముతో] అయ్యో! కుమారా! నీవాభానుకోపు

హాన్నములనే పడితివా?

క. హా! నాకుమారరత్నము!

హా! నయగుణధామ! ముఖజితాంచిత సోమా!

హా! నా ధననిక్షేపము!

హా! నిర్జరకులలలామ! హా! జయకామా!

మున్ను శూరాదులఖండ భుజాదండమండితులై స్వర్గపురంబు

పైదాడి వెడల నుద్యమించెడు సమయంబున

మ. తనయా! రక్కసిదాడి కోడెదనుచుఁ దామోదరస్థానమం

దున నిన్నుంచితి, నీవు తత్పురిని సంతోషంబుతో నుండగా

విబుధీటుల్ వసియింపరమ్మని సురల్ వేడంగ వెంచేసియుం

దని దుఃఖాంబుధి గుంకుచుఁ రిపుని చేతంజిక్కితే యక్కటా!

విష్ణు—పురందరా! సమాచారము సాంతముగఁ దెలిసికొనక యిట్ల

బూనిన నేమి ప్రయోజనము కలదు?

బృహ—వృద్ధశ్రవా! యుత్తలపాటుతొలఁగి వృత్తాంత మాద్యం

మాకర్ణింపుము.

దేవేం—నారదా! పట్టువడిన నాముద్దులపట్టిని విడిపింప నెవ్వఁడేని

బూనుకొనెనా?

నార—ఒక్క యైరావతముమాత్రి మరాతి హస్తగతుండైన జయ

తకుమారుని విడిపింప నుద్యమించి యసహాయ శూరత్వమున నస

రసంఘమునఁజొచ్చి కరపదదంతఘాతల దైత్యుల ఖండించుచు ఘో

రంబుగ దురంబొనర్చుచుండ—

దేవేం.—ఆహా! యేమి యామైరావతంబునకుఁ గల కృతజ్ఞత?

క. దురమున యజమానుండరి
కరగతుఁడై యుండెననుచుఁ గనలుచ నేవాం
తరమునఁ జొరఁబడి దైత్యులఁ
గరపద దంతములఁ గూల్చి గజముతవ కిసే!

చాండలి! నీసాహాయ్యంబెన్నటికిని మఱపురాదుకదా!

ష్ణు—సునాశీరా! నిరంతము నీసంరక్షణములో నున్నందులకా యై రావతము జయంతకుమారునెడఁ ధనపరిపూర్ణకృతజ్ఞతఁ జూపించి నది.

హ్మ—వేలుపుపీటిలో నీమాత్రము సాహాయ్యంబొనర్చిన వీరుఁడొ క్కరుండును గానరాకపోయెఁగదా!

దేవేం—మునీంద్రా! ఆలంబొనర్చుచున్న యైరావతమరి వీరుని సంహ రించి జయంతి కుమారుని గాపాడినదా?

ర—లేదు లేదు. అట్టి మహాద్భాగ్యమిట్టి దుర్దశలోనున్న మాకెట్లు సంఘటిల్లును.

. సమర మొనర్చుచున్న సితసామజమద్భుతలీల వైరివ
తము రదనంబులం బొడిచి క్రిమ్మఱఁ గుంఠితదంతిమగ్ర్యే

దేవేం—కట్టా! యాదుష్టాత్ముని వక్షస్థలమెంత గట్టిదై యుండునో గాని వజ్రాయుధవజ్రసమానములగు దంతిదంతముల సహితము విదళింపఁ గలిగినది.

ష్ణు—పాకశాసనా! మున్నాళ్లని చిన్నతండ్రి వక్షముఁ దాఁకి యస్త్ర చ్ఛక్రాయుధము చెక్కివోయినప్పుడు దంతిదంతము లీతని వక్షో ఘాతమున భగ్నంబగుట యొక యాశ్చర్యమా?

—అసురాగ్రజుల వక్షస్థలములు వజ్రసమానములగుటచేతనే మన

క. ముద్దులకొడుకా! ఏవా
గద్దఱిరక్కసునితోడఁ గయ్యంబునకున్
సిద్ధపడుతఱిని వినఁబో
వద్దని యమరేజ్యుఁడేని వారింపఁడుగా?

విష్ణు—సునాశీరా! అసురాధీశకుమార సమాచారాకర్ణన వికారమున సుపర్వదేశికుని యందకారణ నేరమారోపించుచున్నవాఁడవు గాని యామహానుభావుఁడమరులయెడ సర్వదా తన యావచ్ఛక్తిని ధారవోయుచున్నాఁడు.

బ్రహ్మ—సురేంద్రా! త్రికాలవేదియుఁ ద్రిదశోపకారపరాయణుఁడు నగు దేవేజ్యుఁ డెన్నఁడును దనయందు లోపముంచుకొనునని తలంపకుము. భానుకోపు నెదురింపఁబోవు నీకుమారు నాయాచార్యుఁడు తప్పక వారించియే యుండును గాని యతని నావరించిన పాపపువిధి గురువాక్యంబులాలకింపనీయక మెడఁబట్టి రిపునియొద్దకుఁ దొందరగా నెట్టుకొనిపోయినది.

దేవేం—ఆపత్సమయమున నాబోటి యధైర్యచిత్తు లెన్నియో విధంబులఁ జింతిల్లుచుందురు గాని యెవ్వరికేని విధి యలంఘ్యముకదా! ఏమి సేయుదును? నారదా! భానుకోపునిచేఁ గొంపోఁబడిన నాకుమారుని శూరపద్ముఁ డేమిచేసెను?

నార—శూరపద్ముఁడు జయంతుని వీక్షించినతత్క్షణంబె క్రోధావేశంబున నేత్రంబుల విస్ఫులింగంబులురల బండ్లు పటపటఁ గొఱుకుచు మీసవక్త్రికాంచుచుండ రాక్షసులచేఁ బదతాడనంబుఁ జేయించి కారాగారబద్ధునిఁగ నించెఁ గావున నీవాతని గాపాడుకొమ్ము. నేను నాకనిమిషాఁ బోయెదను. [నిష్క్రమించును]

దేవేం—[అత్యంత విషాదముతో] హా! పుత్రా! సుకుమారగాత్రా!

సిన్నా రాత్రించరాధముఁ డజముఖి నమక్షమున దానవాళిచేఁ బ
తాడనము చేయించుటయే కాక కారాగార బద్ధునిగాఁ గూడఁ జే
యించెనా?

ఉ. అక్కటా! పుత్రికా! విమలహర్మ్యములం దనిశంబుమిత్రులం
దక్కఁగఁ గూర్చి క్రీడలను సల్పుచు సౌఖ్యములొందుచుండు నీ
వొక్కఁడవిప్పుడా యసురుఁడుంచిన ఘోరపు బందిగంబు నం
దెక్కరణిన్ వసించితివొ? యెంతగఁ గుందుచునుంటివో మదిన్.

సీ. కరుణావిహీనులై చెఱసాలకాపరుల్
పెట్టుబాముల కెట్లు కొట్టుకొనెదొ?
కర్కశపాషాణ కలితమౌ భూమిపై
శయనింపలే కెంత శ్రమముపడెదొ?
మాటిమాటికిఁ గుట్టుమశకాది కీటక
పాళియా కెన కెంత భయముపడెదొ?
దుర్గంధమిళితవాయూల మాఘ్రాణింపఁ
జాలలే కెంత యసహ్యపడెదొ?
పవలు రవికాంతి, రేయి దీపములకాంతి
యైన నించుకనుండని యట్టి యంధ
కారబంధుర మైన యాకారఁజిక్కి
యెంత దురపిల్లుచుంటివో యొక్కఁగనుగద.

విష్ణు—మహేంద్రా! విచారించిన సార్థకమేమికలదు. ఊరడిల్లుము.
బ్రహ్మ—అబ్బా! పుత్రశోకసాగరావతరణ మెంతయుఁ గష్టముకదా
దేవేం—బ్రహ్మ విష్ణులారా!

దరువు. ఆది. ముఖారి

ఎటులబ్రికుకనోపుదు! నీదుఃఖభరమింక
కటులస్సై! పంగజాలుదు ॥ఎటు

కటకటా! దానవుఁడు। కరుణలేక నాసుతుని

గటికిమై బందిగమునం। గుటిలతనుంచెనింక ॥నెటు॥

సుతుని పాల్గొని నాడు। నతిగుందసాఁగునింకే

గతినూరడింతును। మతిపోఁచఁడుండె నయ్యో ॥యెటు॥

నాకముదహింయుంచే। నాగదంతంబుల

వీఁకంకుల్చిసందన। విపినము పాడుచేసె ॥నెటు॥

ధారుణీమోరిపుర। ధాముఁడైనట్టి చింలా

వీరభద్రివరదుని। వేఁడిన దయరాదాయె ॥నెటు॥

క. మీరే నాతలిదండ్రులు
మీరే నాభ్రాతృబంధుమిత్రులు తలఁపఁగ
మీరే గురుదైవంబులు
మీరే నాదిక్కటంచు మిమ్మునఁ దలంతుఁగా.

కావున మీరా శూరాసురుల దోరించు నుపాయంబారసి నాబారి దీర్పకున్న నేనెట్లు తాళఁగల్గుదును?

స్తు— దరువు. ఆది. భైరవి.

చింతింపనేల। దేవేంద్రాయిటు ॥చిం॥

ఎంతకాలము వైరివరబల। మొనఁగు సోమసనుగముగాహము

అంతదనుకను వానిబాధల। ననుభవింపక తీరదనఘా ॥చిం॥

అసురసంహారుఁడగు నయ్యను నేనే। యలజడితోడ

నసురశబ్దముపినిన దేహము। గనుగంపిల భీతిచేనా

యసురుని ల్వాకొందలంచియా। యుర్వీశ్వరముగ కేగుడెంతును -॥

వంతంబుతోను। శూరుండిపుడు। వరబలియుండెను

ఇంతతలబెవ్వనికినై నను। సాఁగునే యొకరీతి ఇందుర్డు

కొంతకాలము పూర్ణుడై మతి।

కొంతకాలముక్షీణుఁడౌఁగద ॥చిం॥

ారపద్మాసురుఁడు। మమ్మిప్పుడు। కారించుచుండెఁ గడు
రీతిమనుదుమింక। కేరినిగొలుతుమా
ిరుబాధలుతొలంగ। దాశిచూపుముశర్వ ॥ని॥
రమకారుణ్యసాంద్రా। సదాశివ। భర్గకోటీరచంద్రా।
కిచర్మాంబరధర గరళకంధరభక్త
వరదదాతామణీ। వర కిల్బిషహార ॥ని॥
న కాచలేంద్రచాప। మహాదేవ। కనుముమమ్ముల వత్కృప
నుసిగవేల్పు మున్న మొవాలుదాపయ్యా
నుజబాధలమల్పు। జనుదెంచు మగతల్ప ॥ని॥
విచంద్రానలనయనా। పరమాత్మనా। కవిజనవ్యాఘ్రమనా
అవని శ్రీమోరిపు। రాధీశ్వరుండ నై
ప్రవిమలమతిపేర। భద్రునివేలిన యభవ ॥ని॥

వృ. దేవహారము—సాంబశంకర మహేశ శర్వ సర్వప్రకాశ
అంబరోద్ధామకేశ యహితమండలవినాశ.
అంబికావ్యాదివ్యహార అంధకాసురవిదార
అంబకత్రయవిరాజ ఆశ్రితకల్పభూజ.

బ్రహ్మ. పంచ. చరాచర ప్రపంచ జంతుజాలమెల్ల జక్కులం
బరాకులేక కాంచుచుండి పాలనంబుచేసెడా
పరాత్పరా మహానుభావ పాపనాశనా హరా
బిరానవచ్చి మమ్ముఁబ్రోవు ప్రీతిఁగాల కంధరా.

తే—అఖిల చరాచర జంతుజాలముల నరసి పాలించుచున్న దేవా
శంకరా! జాలిమాలక మమ్మేలినట్లనే పాలింపుము. పాలింపుము.

(అంత శివుఁడు ప్రత్యక్షమగును)

దరువు. అట. శంకరాభరణము.

సాక్షాత్కరించె। సురలకు శివుఁడు ॥సా॥

సాక్షాత్కరించెనో। లోకులకు సురలకు
సక్షిణకరుణాక। లోకవీక్షణుఁడగుచు ॥సా॥
వృషభవాహనుఁడై। వ్యాఘ్రాజినా। వృతకటిస్థలుఁడై
విషధరగళముతో। విన్నేటి జడలతో
విషధరాభరణుండు। విబుధబృందము మ్రోల ॥సా॥
పవనవేగమున। భక్తులఁజూడఁ। బరమహర్షమున
నవని శ్రీమోరిపు। రాధిపుఁడగు సాంబ
శివుఁడు నిర్జరులర। క్షించు తలంపున ॥సా॥

వి—క. వందన మిందుజటాధర
వందన మహీరాజభూష వందనమభవా
బ్ర— వందనము నీలలోహిత
వందనమో యభ్రకేశ వందనము శివా.

దే—పదివేల నమస్కారములు పరమేశ్వరా!

శి—క. క్షేమమె విష్ణూ? విధాతా
క్షేమమె? దేవేంద్ర! విబుధసేనకు నీకున్
క్షేమమె! రక్కసికూళల
బాములు చేకూడకుండ బ్రతుకుదురో కో—!

బ్ర. వి. మ. దరువు. ఆది. సురట.

ఏమనివిన్నవింతుము। శంకరసీ ॥కేమని॥ రాక్షసబాధ ॥ఏమని॥
ఆముస శూరపద్ముఁడనుజ సహాయుఁడై
నేమారమరులను వేధించుచుండె నిపు ॥ఏమని॥
పురుషులఁ గట్టనెంచెను। దొరికినస్త్రీలఁ జెఱలలోఁ బెట్టనెంచెను
ధరణి శ్రీమోరిపుర। ధాముఁడవగునీ
వరమున దనుజులు। వరలుచు నున్నారు ॥ఏమని॥

విష్ణు—గీతార్ధము. ఇంతవఱకును దమకృపయనుమడింప
నిర్జరానీకమును మేము నిర్భయముగ
నుంటిమిప్పుడు ముల్లోక కంటకు
లగు శూరసింహాస్య తారక॥ క్రూరరాక్షసులు।

మాపరమున! మీఱి లోకములు। సారెసారెకుఁ గలఁచిసర్వసు
పర్వులఁగారించి సుపనతుఁ జేరపొందుచునుండ॥ వారితో మేమె
న్నిమారులో పోరి దురమునఁ నోడిభయమునఁ బాఱివచ్చి హిరణ్యా
నగమునఁ జేరి మిమ్ముఁ దలఁచుచుంటిమి ॥క్రూ॥

మహేశ్వరా! ఘోరరాక్షస సంహారుఁడనగు నేను సహితమా
శూరపద్మదైత్యబాధలకు లోనై దీనుండఁ గావలసివచ్చె. ఇంక నేమి
సేయుదు. అదుష్టుల చర్య లీవిధంబుగ నున్నవి.

బ్ర—శంకరా! అంతియేకాదు. సకలచరాచర జంతుజాలంబుల నరసి
యరసి సృష్టించుచుండెడు నన్ను సహితమా శూరపద్ముఁ డనవర
తము తన సభాస్థలిని బంచాంగము చెప్పునటుల నియోగించె నిం
కేమి సేయుదును?

దే—చంద్రశేఖరా! శూరపద్ముఁ డఖిల సురవర్వుల నత్యంత నీచకృ
త్యంబులకు నియోగించుచుండుటయే కాక తన సహోదరిమూల
మున నా సతీతిలకము సౌందర్యంబెఱింగి మోహాంధకారంబునఁ
గన్నులఁ గానక

సీ. ననుబట్టి బంధించి నాసతిఁ దెమ్మని
దళనాయకుని బంపఁ దలఁచె నంచు
నారదుండెఱిఁగింప నాతితో శ్రీకాళ
వనముఁ జేరితి గురువరుని పూజ్య
నత్తఱి రిపుబాధలతిశయింపఁ గఁ గొంద
అమరులు నను జేరి యరులఁ జంపు

మార్గమరయకున్న మనఁగ లేమనమహా
కాళుని చెంత నాకలికిఁ డించి.
యసురనాశన వరంబడుగ మీసన్నిధి
కరుదెంచితిని దివిజాళితోడ
నంతఁబులోమజన ముఖ కొంపోవు
చుండఁగాఁ దత్ప్రాలకుండు కినిసి
కరమొందు చెండినా కాంతఁ సురక్షించె
ననినాకు నారదముని తెలుపఁగ
విని తత్తరంబున వనిత చెంగట కేగి
కొనివచ్చియుంటి నీ సుధరమందు
నేమిచెప్పుదు నీశ్వరా! యింతలోన
భానుకోపుఁడు మేషాన్య పాటుగాంచి
నాకపట్టణమందున్న నా కుమారుఁ
బట్టి చెర పెట్టెనని తెల్పె బ్రహ్మసుతుఁడు.

తద్వృత్తాంతమాలికించినది మొదలు హృదయమున నమిత చారము దయించి వృద్ధిఁబొందుచుండుటచే నేనీ గోవిందకళత్రానందు సాహాయ్యంబున రాత్రించర వినాశనార్థమై మిమ్ముఁ గూర్చి తపించుచుంటిని. కావున మమ్మీ యాపత్సముద్రమునుండి తీ ముఁ జేర్చ భారము మీయదియే.

శి—మహేంద్రా! ఇందులకేనా మీరందఱు నన్నుఁ గూర్చి తపించు చుండినది?

దే—చిత్తము. శీఘ్రముగఁ దైత్యసంహరణమొనర్చి మమ్మాపదను డి రక్షింపుఁడు.

వి—ఆర్త జనరక్షకులరగు మీరీవిషయమునఁ బరిపూర్ణశ్రద్ధవహింప వలయును.

దే—బ్రహ్మర్షులారా!

క. శితికంఠుఁ డిడిన వరమున
కతిశయముగఁ గుతుకముదయమయ్యెను మదిలో
వెతలెసఁగఁ బాయును మనకిఁక
నతులితసుఖ మనుభవించునద నరుదెంచున్

కావున మనమిఁక భయమునువిడచి భద్రముగ మనవచ్చు

వి—మహేంద్రా! ఆర్తపనదీక్షాపరతంత్రుఁ డగు చంద్రశేఖరుఁ
సాక్షాత్కరించి యభయం బొసంగియుండ మనకిఁక భయమె
దుఁకు?

బ్రి—అవును. శంకరానుగ్రహమును బొందిన మనకింక నిశ్శంకగ ద
రుకు కొంతవడి విశ్రమింతము.

దే—(ప్రక్కకుఁ జూచి) అయ్యో! బ్రహ్మర్షులారా! చూడుఁ
చూడుఁడు. ఆప్రక్కనుండి కొందఱు పురుషులు భీకరాకారమ
తో మనదెసకు వచ్చుచున్నట్లున్నారు.

బ్రి—(నిదానించి) ఓహో! వారు రాక్షసులే. మనకొరకే వచ్చు
న్నట్లున్నది. ఇఁక మనగతి యెట్లో కదా! (భయము నభినయించు

వి—భయపడకుఁడు. భయపడకుఁడు. రాక్షసులకీ మారునగ మగ
కుండఁ బూర్వము శంకరుఁడు శాపంబిడెను గావున క్రూరక
క్కకి వచ్చినను వారలవలన మన కేదియు హాని వాటిల్లదు. ధైర్య
వలంబింపుఁడు.

దే—అవును. నాకిది నారదుఁడు కైలాసమునఁ దెలియఁజేసెను.

బ్రి—అట్లయిన మనమిచ్చటనే యుండి వారిచర్యలను గనుగొంద

[అంత రాక్షసులు ప్రవేశింతురు]

దరువు. ఆది. పంతువరాళి

వచ్చె నౌకమూకలప్పుడు। దేవేంద్రునరయ

ృకలడఁ గుర్మిమ్మరి యే। తావుసఁ గనలేక మిగుల
ప్పులుచ్చరించుకొనుచు। విచ్చలవిడి బయలు దేరి ॥వ॥
వులమడువులను గాంచియుఁ రాజాజ్ఞజొప్పున। నిడుదనగము
జూచియు। పుడమిలో శ్రీమోంచినగర। మృడుని చరణ
గముఁదలచి। విడునక బంగారునగము। నడకువడిగ సురల వెదుక ॥వ॥

రాహాము } [సింహ ముఖునితో] సింహాముఖా! మనము శచీంద్రున
డు } కొఱకు భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జన
లోక, తపోలోక, సత్యలోకములును, నతల, వితల, సు
తల, తలాతల, రసాతల మహాతల పాతాళలోకంబులును వీని
యందుఁగల నదులు, పొదలు, గుట్టలు మెట్టలు, పుట్టలు చెట్లులు
తిరిగితిరిగి వెచ్చుటను గానక మగిడి యీప్రదేశమునకు వచ్చితిమి
ఇప్పుడైన వారలు కన్పించకుండినచో బట్టణమున కేమొగము
పెట్టుకొని పోదుము?

—వరాహముఖా! మనము భానుకోపునితో నాకమున కేగి జయం
తాది సురలనుబట్టి చెఱలోఁ బెట్టితిమికదా! ఇప్పుడు మాత్రమా
శచీంద్రుల నిచ్చట గాకున్న వేఱొకచోటనైన నేలపట్టుకొనలేము
ఎంతకాలమైనఁ బట్టుకొన్నదే మగతనము. వారల నెట్లైనఁ బట్టు
కొని తోడ్కొనిపోయినచో మనము రాజువలన గొప్ప బహుమతి
పొందవచ్చును.

—ఎక్కడిబహుమతులు? పాదములుపగిలి, నాలుకలిగిరి, కన్నులు
కాయలుకాచి, మేనులుసన్నగిల్లి చచ్చితిమి దేవుఁడాయని తిరిగెడు
మనకాశచీంద్రులు దొరకుటెక్కడ? రాజు బహుమతులిచ్చు టె
క్కడ? ఇదియంతయు వృథాప్రయాసముకదా!

—ఓకీవరాహముఖా! నీ వెప్పుడునిట్లె యేడ్చెదవు. గూఢచారులలో

—ఓసింహముఖాదిచారులారా! దేవేంద్రుఁడు మౌని వేషముతో నీ
దండఁ గూర్చున్నాఁడు. రండు రండు.

—[కొందఱురాక్షసులతోఁ బ్రవేశించి]

క్కడ యెక్కడ యెక్కడరో యా తెక్కలికాని విడువకురో
క్కనమునఁ బెడ తెక్కలఁ గట్టియుఁ జిక్కఁబట్టుమి దెవత్తుమురో ॥ప॥

—ఓరీదుర్మార్గా! యిందాఁకా! యెంత కాలమునకుఁ గంటఁబడితివిరా? ఇఁక నెట్లుతప్పించుకొనఁగలవో చూచెదము. (అని పట్టుకొనఁబోవును)

మని—(ఇటునటుపరుగెత్తుచు) అయ్యో! అయ్యో! యిదియేమిపాపము. నన్నేల పట్టుకొనెదరు నేనిందుఁడ నెట్లగుదును. రక్షింపుఁడు. పట్టుకొనకుఁడు.

—ఛీ! వెధవా! నోరుమూయుము నీవేషములు మాయొద్దనా? ఓరీ సింహముఖా! యీతుచ్ఛుని తెక్కలు గట్టిగబంధింపు. మన మహారాజునొద్దకుఁ దోడ్కొనిపోదము.

ము—అయ్యో! నాకర్మముకాలిపోను నేనిందుఁడనుగాను. నన్నేలకట్టించెదరు బాబూ- ఊ- ఊ (అనియేడ్చును.)

—ఛీ గాడిదా! నోరెత్తు తేమిచేసెదనో? నీబుడిబుడియేడ్పులు మాయొద్దనా? ఈమాత్రమునకే యింతయేడ్చుచుంటివి అవ్వడే యేమైనది? అవగింజలో నరపాతికకాలేదే? (అనితెక్కలుకట్టనారంభింతురు.)

ము—(ఏడ్చుచు) సంవాదదరువు. ఏక. దేవగాంధారి

ందుఁడనే గాను బాబూ నన్నేందుకు గట్టెదరుబాబూ
ందమందారబాల చంద్రశేఖరపాద
ద్వంద్వంబునిల్పినే నిందుఁగూర్చున్నాను ॥ప॥

—దొంగమాటలునమ్మవారి యంత వెంగలులముకాముఱోరి

వంగ తెలుఁగుదుమింక జాగు సేయక నీదు
అంగనయేమాయె వతిశీఘ్రముగఁజెల్పు ॥దొ

సిం—ఓరినీచా! నీమాయమాటలునమ్మి మోసపోవుదుమనుకొంటి
నీవునిజముగానిందుక్రిందవే. నీపెండ్లమునెచ్చటనుంచితివి? జెప్ప
లేకున్న నిప్పుడే చప్పరించుచున్నాను. హుం (అనిమీఁదఁబడఁబోవు

ముని—(వడకుచు) మీపాదములుసాక్షిగా నేనిందుక్రిందనుగాను నన
విడిచిపెట్టుఁడు బాబూ- ఊ- ఊ (అనియేడ్చును.)

వ—సింహాముఖా! వీనియేడ్పుచూడఁగా జాలిపుట్టుచున్నది. వీఁడెవ
డో నిదానించుము.

సిం—(పరీక్షించి) ఓరీవరాహాముఖా! ఇదిగో! ఇటుచూడుడు. వీని
దుక్రిఁడనుటకు శరీరమునిండఁ గన్నులుండవలయునుగదా!

వ—(చూచి) ఓసి ఔనురా! వీఁడునిజముగానిందుక్రిఁడు కాడుఁరా.

సిం—(మునితో) ఓరీనీ వెవ్వండవో చెప్పు.

ము—అయ్యా! నేనొకమౌనిని.

వ—దేవేంద్రుని నీ వెఱుంగుదువా?

ము—ఎఱుగుదును.

సిం—వాఁడిప్పుడెక్కడనుండెను.

ము—అదినాకు దెలియదునాయనా.

వ—ఎందుకు దెలియదు. నీదివ్యదృష్టిని జూచి చెప్పుము. లేకున్న నీప
బట్టెదము.

ము—(వడఁకుచు) అయ్యా! ఊఁ- ఊఁ- [అనియూరకుండును]

సిం—ఛీ వెధవా! చెప్పు తప్పదు లేకున్న నీడొక్క చీల్చెదను [అనిమీ
దికిఁబోవును.]

ము—చెప్పవలయునా?

—ఏమిరుఇంకను వలయునాయనుచున్నావా? మాకాతనిసంగతిచెప్ప
క తప్పించుకొనుటకు నీతరమా? నీయబ్బతరమా? చెప్పు చెప్పు
[అనిజుట్టుపట్టుకొనును]

—చిత్తము చిత్తము. చెప్పెదనువిడువుఁడు. [అనిపైకిఁజూచి] అ
య్యా! యిందుక్రిఁడిప్పుడు మేరుగిరినున్నాఁడు.

—ఆపర్వత మెక్కడనున్నది.

—అదిగో! ఆకనుపించుచున్నదే

—ఏదిరా?

—అదేమిటయ్యా! మీకగుపడుటలేదా?

—లేదు. ఎక్కడనడువుము

—రండు [అనికొంతనడచి] ఇదేపర్వతముచూడుఁడు[అని చేయెత్తి
చూపును]

—ఓరీవెధవా! యేదిరా? ఏవోకొన్ని మాయమాటలచే మమ్ము
మోసపుచ్చనెంచితివాయేమి?

—మాయమాటలుకావు ఇదిగోనేనెక్కెదనుచూడుఁడు. [అనిమెల్ల
గాఁబర్వత మెక్కిపోవును.]

—వరాహముఖా! యేఁడీఅదుర్మార్గుఁడెక్కడ? కన్పించకున్నాఁడేమి?

—ఓరేఆమాయముండకొడుకిదేపర్వత మెక్కెదనని చెప్పి యెక్కినట్ల
భినయించుచుమాయమైనాఁడు ఏమియీవిచిత్రము;

—వాఁడుమనకన్నులలోదుమ్ముకొట్టియేచాటునకోపోయి యుండును
లేకున్న వాఁడెక్కుట కిక్కడనేమియాధారమున్నది?

—ఔను ఏదోమాయజరిగినది. లేకున్న వాఁడేల్లుకన్పించకుండును.

—ఒరే! ఆచక్కినేదోచప్పుడువినవచ్చుచున్నది. ఆలకింపుము.

—ఔను ఏదో కలకలమువలెనున్నది. రమ్ముపోయిచూచెదము.

[ఇరువురునిష్క్రమింతురు]

(ఇంద్రాదిదేవతలుయీవింత పైనుండి చూచుచుందురు)

దే—బ్రహ్మవిష్ణులారా! దర్వు రూపకము భైరవి

కనుగొంటిరిగదమాధవ కమలోద్భవులార! యిపుడు
దనుజులుననురోయవచ్చి తపసినిబాధించుటెల్లఁ ॥గన
ననుజూవుమటన్న మౌని మనమునబహుభీతిచెంది
కనకాచలముననిందుఁడు కలఁడదిగోఁగనుఁగొనుఁడనె ॥గన
దనుజులుకనలేకముని వరునిఘనముగబాధించిన।
గనుఁడేఁబోయెదనని తాఁ గనకాచలమునఁ జేరుట ॥
అసురులకీపసిఁడికొండ పొసఁగినచోమనవేల్పుల
యసురులుతమయేలికకడ వెననుంచరె విసువులేక ॥
వసుధలోశ్రీవీరభద్రు వరదుండయి వరలుచున్న
యనమనేత్రుఁడమరులకీ యాధారముకలుగఁజేసెఁ ॥

చ॥ కనుఁగొనియున్న వారుకద! కాలునిదూతలబోలు రాక్షసుల్
పనివడివచ్చియద్రికడభక్తిఁ దపంబొనరించుచున్న మౌ
నినిగనిపీఁడయిందుఁడని నిశ్చయమౌనను లొచునాతనిర్
ఘనముగబాధపెట్టి కడుఁగాఱులుగూసిన చందమంతయున్.

అట్టి ముక్కిడిరక్కసుల కీపొన్నుగట్టు కాన్పించిన మనలఁబట్టి
కొని తమయేలికకట్టెదుటఁబెట్టకుందురా?

వి—నిస్సంశయముగఁ బెట్టితీరుదురు. మహానుభావుఁడా శంకరుఁడ
మరులకీయాధారమేర్పఱచి చాలఁబున్నెమును గట్టుకొన్నాఁడు

బ్ర—ఆమహాదేవుఁడట్లుచేయకున్న మనపనిహుళక్కియేకదా!

దే—అది నిక్కవమేకాని మనమీరీతినరాతులకు భీతిల్లియెంత కా
మీకనకాద్రినిగాఁపురముండ నోపుదుము.

బ్రి—కుమారోదయమగునంతవఱకు.

వి—అవును. అతఁడేమనకాఖితమిూఁడేర్చువాఁడు.

దే—అట్లైనన్ోవిధువిధాతలారా !

ఉ॥ ఎప్పుడుశంకరుండునృజియించుఁ గుమారునిబాహుపీర్యసీ
ఎప్పుడుదానవాళినశియించును వేలుపుమూఁకపాటులిం
కెప్పుడుపాయుస్వస్థలములెప్పుడుచేరి సుఖింతుమిప్పుడీ
చొప్పునరాక్షసుల్ మనల శోధనఁజేయుచునుండిరుగ్రులై.
మఱియు,

గీ॥ శంకరునిబాసినతి హిమశైలపుత్రి
యగుచుఁ జెన్నారు శంకరుండతివిరక్త
మానసుండయిఋషుల కామ్నాయమర్మ
ములనుగఱపెదున్యగ్రోధమూలముునను

ఇట్లత్యంతవైరాగ్యచిత్తుఁడై వర్తించుచంద్రమౌళికుమారసమాగమంబెట్లుసంఘటిల్లును.

దరువు ఆది కాంభోజి

ఆలోచింపుఁడయా యోహరివిధాతలారా ! మిూరిత్తఱి ॥నా॥
ఏలీలశంకరుండు పార్వతి। నెనసిమనసుదీరఁ గేళిసల్పును
జాలంబుస్సేయకింకనిశ్చల। స్వాంతాంబుజాతులరై సాధన ॥మా॥
స్వేతాద్రిన్యగ్రోధమూలమున। చిన్ముద్రిదాల్చినిష్ఠమునిసం
ఘాతంబుగొల్వ వెలయుశంభుండేతీరునంగోరుఁబార్వతిని ॥ఆ॥
అపూర్వదంపతులనుగూర్పక। యేపగిదిజన్మించుఁగుమారుం
డేపగిదిదైత్యనాశనంబగు। నేపగిదిసౌఖ్యమందెదరుసుర ॥లా॥

క॥ ఆగిరిజాపరమేశుల
కేగతివాటిల్లునొకూట మింపుదలిర్పన్

వేగమెతిద్యత్నంబుఁ
బాగుగ యోజించి సల్పవలయును మీరల్

ఆగిరిజాశంకరసమాగమంబుగాక మనయాపదలునశింపవు గావు నఁదద్విషయమాలోచించి కర్తవ్యమాచరింపుఁడు

వి—మహేంద్రా! యోచించుట కేమున్నది?

క॥ మరుఁడఖిలభువనవనితా
పురుషులనం యోగమునకుఁబురికొల్పెడునే
ర్పరిగానతఁడెగౌరీ
పరమేశులఁ గూర్పఁదగిన పాత్రుండెన్నన్

ఇక్కార్యమునకు మన్మథుండుదక్షుండుగావున వానినింబంపించి సమగ్రంబుగ మనయీప్సితంబునెర వేర్చుకొందము.

దే—మాధవా అత్యంత నిష్ఠాగరిష్ఠాత్ముండై వటద్రుమూలంబునఁద పించు శంకరుండు పంకజాస్త్రునకులోనై హైమవతీసంగమమున కంగీకరించునా?

వి—మహేంద్రా దరువు ఆది వసంత

అంగీకరింపఁడే । యద్రిజాతరతిశివుఁ ॥డం॥
అంగజుండురంగుమీఱఁ జక్కెర । సింగిణిఁబూములుకులుగడుగూరిచి
భృంగశింజినీధ్వనిదశదిశలఁజె । లంగనంతరంగముభేదించిన ॥నం॥
ఈరేడులోకవాసులెల్లరు । మారాస్త్రబాధకోర్వఁజాలక
నారీమణులఁ గూడియుండరే । వీరభద్రవరదుండుమాత్రమిపు ॥డం॥

క॥ ఇంచువిలుపూవుటమ్ములు
నంచితముగఁదాల్చిజగములతినిపుణతతో
వంచించుపంచబాణుఁడు
పంచాస్యునిగూర్చవేఁడ పార్వతితోడన్

సకలలోకమిధున సంధాయకుండగు మకరాంకుఁడకలంకహృద
యునిశంకరునిసహితము వికలమనస్కుని జేసినిరంతరమద్రి జాతా
సంభోగేచ్ఛకుండగునటులఁ గావింపకుండునా ? ఏలనీకీసంశయము ?

దే—నారాయణా ! మహేశ్వరుఁడు

సీ॥ రాజయోగము విసర్జనచేసియెటుశైల
కన్యాస్యరాజయోగంబునెనయు?

వి— భ్రమరఝంకృతులకు భయమొందిహిమశైల
కన్యాస్యరాజయోగమునెనయుఁడె ?

దే— జ్ఞానసుధారసం బానుటమానిగా
ర్యధరసుధారసం బానుటెట్లు?

వి— చెఱకుసింగిణిమ్రోత చెవిసోఁకఁగలఁగిగా
ర్యధరసుధారసం బానకున్నె ?

దే— షట్చక్రశోధనఁ జాలించిపార్వతి
స్తనచక్రయుగ్మమేసరణిఁ గోరు?

వి— కుసుమాస్త్రుమదనాట విసువొందిపార్వతి
కుచచక్రయుగ్మంబుఁగోరకున్నె ?

దే— హంసజపంబాత్మ నాచరించుటవీడి
యరయునేగతినుమాహంసగతులు ?

వి— శుకపికధ్వనులకు వికలాంతరంగుఁడై
యరయకుండునె యుమాహంసగతులు

దే— యమముఖాష్టాంగయోగబంధములఁబాసి
పొందునేయార్యఁ జౌసీతిబంధములను ?

వి— మలయమారుతములకుల్కి మలకుమారిఁ
బొందకుండునె చౌసీతిబంధములను

దే—మాధవా ! నిష్ఠాగరిష్ఠాత్ముఁడై యలరుచుండునభవునియెడ భా
భవుని బాణంబులు పనుసేయునేయనినాకించుకశంకతోఁచుచున్న
వి—దేవేంద్రా ! యిటువినుము.

ఆ॥ వె॥ ఆత్మనిష్ఠఁడపసియైశంభుఁడుండిన
నుండుఁగాక మరుఁడునిండు వేడ్కఁ
బోయివానితపము బూడిదపాల్ సేసి
శైలజనెనయించు శంకయేల ?

నీవింకశంకనువిడిచి శంకరునిపైకిఁబంకజాస్త్రునిబంపించుటకియ
కొనుము

బృ—పురందరా ! పంచబాణుఁడు దక్కఁదది తరులుపార్వ
పరమేశ్వరసంఘటనమాచరింపఁ జాలరుగావున మన్మథుని బంపిం
మనమనోవాంఛలు సర్వంబును దీర్చుకొందము మాఱుచెప్పకుము

దే—చిత్తము మీయిచ్చవచ్చినట్లాచరించి సత్వరముగిరిజాశ
కర సంఘటనముచేయింపుఁడు.

వి—అట్లయిననరవిందబాణునిగూర్చి ధ్యానింతము.

బృ దే—చిత్తము [అందరుధ్యానమునభీన యింతురు]

దర్వురూపకము భైరవి

మారాసుకుమారవేగ । రారామాకోర్కిదీర్ప
కూరిశంబరాసురనం । హార మేరునగసుధీర ॥మా
దీనావనమీనధ్వజ । సూనాంబకసుందరాంగ
మానసపద్మంబులనిను । మఱిమఱిస్మరియింతుమిపుడు ॥మా
కామాగుణధామాబల । భీమాముఖజితసోమా
యీమహిశ్రీమోరి పట్టణేశునిమది ద్రిప్పవలయు ॥మా
కందద్వయమణిగణనికరనవాటీరీ గర్వనరసిజవ్రత ము

ా రాశ్రీరామాసుకుమారామదినిదలఁచితిమి మనలవలదురా
రాచారాధీరవిచారానదమలచరితసుజనగణవినుతా
ాపారావారగభీరావిదళితరిపుమదవినయగుణగణా
ారుణ్యసాంతాభవకారాకదనజిత జననికరకుసుమశరా
ర్భిత కం మారాశ్రీరామాసుకు
మారామదినిదలఁచితిమిమనలవలదురా
సారాచారాధీరవి
చారానదమల చరితసుజనగణ వినుతా.
ర్భిత కం. వీరాపారావారగ
భీరావిదళిత రిపుమద వినయగుణగణా
కారుణ్యసాంతాభవ
కారాకదనజిత జననికర కుసుమశరా.
ర్భమణిగణనికరము. మదినిదలఁచితిని మనలవలదురా
పదములచరిత సుజనగణ వినుతా
విదళితరిపుమద వినయగుణగణా
కదనజిత జననికరకుసుమశరా!
ర్భితనవాక్షరి. మారా శ్రీరామా సుకుమారా
సారాచారా ధీరవిచారా
వీరాపారావార గభీరా
కారుణ్యసాంతా భవకారా.

(అంతమన్మథుఁడు ప్రవేశించును) దర్వు. ఆది. కాంభోజి

ూరుఁడుచనుదెంచె రయమున। సురవరుల చెలతకు ॥మ
ూరుఁడుచనుదెంచెబహుశృం। గారరత్నఖచితమాబం
ారుభూషణములుకర్ణ। కరశిరః కంఠములఁ దాల్చి ॥మా॥

మృదుసుమసాయక పాణివై। ఇంచువిల్లుభుజమునఁ।
బదిలముగ ధరియించిధీ
రుఁడవై॥ అదనెఱింగి మార్గమధ్య। మందెదురై నవిరోఁగ
సుదతులఁ బూరుషవరుల। ముదముమీఱఁ గదియఁజేయుచు ॥మా
చిలుక తేజీ లమరఁగట్టి। మలయపవన రథముఁ।
గులుకుచుఁ గూర్చుండి మననున॥
ఇలను వెలసినట్టి మోరి। నిలయుఁడగు సర్వేశుపాద
జలజయుగ్మము నేమరకనం। స్మరణఁజేయుచు గృహము వెలువడి ॥మా
మన్మ—[రథముదిగి బ్రహ్మ విష్ణు మహేంద్రులను గాంచి]
క. కరితురగ్వాతంసులారా!
మితిమీఱెడు కౌతుకమున మీపదరాజీ
వతతికి నతులొనరించెద
నతిశయకారుణ్యదృష్టి సరయుఁడి నన్నున్.
సురవరులారా? మీమృదుపదారవిందములకు వందనము లా
రించుచుంటిని. గైకొనుఁడు
బ్ర—ఆయుష్మాన్ భవ.
వి—శ్రీమాన్ భవ.
దే—వై భవవాన్ భవ.
శిబ్ర—మన్మథా! నీసందర్శనము మాకు సంతోషకరంబయ్యె ని
దీన వచ్చి కూర్చుండుము
మం—చిత్తము. [అని కూర్చుండి] జగదీశ్వరులారా!
శా దరువు. ఆది. తోడి
ఏలనన్నుఁదలఁచినార లిటుదివి। జేశులార! మీరలెల్లరొక మొగి ॥నే
కాలయాపకంబుసేయకిఁక౯ఁద। త్కారణంబుని। శ్చయంబెఱిఁగింపుడి ॥న

ముజేయవలసినట్టి కార్యం। బెద్దియేని మీకువలసియుండిన
ని నిర్వహించువాఁడ మానకఁ బుద్ధిపూర్వకంబుగ నెఱిగింపుఁడి ॥వ॥
కరత్నకుఁబరగు మీ తమ్మాజ్ఞకు, లోనుగాక మితిమీఱి చరింతునె
ప్రకటముగ మారినగరనిలయుని।

పాదమాన యేతరుణమందయిన ॥నేల॥

వ. అమరవరేణ్యులార! తమరందరు నీగిరిచేరి యేమికా
ర్యమునకుఁ బావనన్నిటుల, ధ్యానమొనర్చుచు నుంటిరావిధా
నమువినవేడుకయ్యెఁ గరుణాం వచియింపుఁడ దెట్టిదైనశీ
ఘ్రమునవహించి సల్పెదను సర్వసుపర్వులు సంతసింపఁగన్.

విబుధశ్రేష్ఠులారా! నన్నేకార్యమునకుఁ బుత్తెంచఁ దలంచి
తిరో కింకరుండనై నెఱవేర్చెద. సత్వరమానతిండు.

—కుమారా! చక్కఁగావక్కాణించితివి. నీయుదారత్వ మెవ్వరెఱుం
గరు? నీచిన్నందునను బరకార్యనిర్వాహకుఁడవై ప్రబలకీర్తి నిసంపా
దించిన బాహువీర్యుండవు. అందువలన నీచే మేమొక కార్యము చే
యింప నిశ్చయించి నిన్నుఁ దలంచితిమి. ఇదిగోఁ జెప్పెదవినుము.

సీ. అనలాత్మవరమున నఖిల దిగ్జయమొంది
భువనకంటకుఁ డయి పొలిచె నెవఁడు
సన్మార్గచరులైన సర్వసుపర్వుల
నీచకృత్యంబుల నిలిపె నెవఁడు
కరుణావిహీనుఁడై సురకామినీతతి
జెఱలయందుంచిన చెనఁటి యెవఁడు
మదయుతుఁడయి శతమన్యు భార్యనుగూడ
నెంచివేచియునుండె నెవ్వఁడట్టి
శూరపద్ముఁ గూల్ప సుతునిఁబుట్టించెద

వని వరంబిడి ధవళాంగు డీపుడు
రజతశైలమున విరక్త చిత్తుండయి
మునులతోడ మౌనముద్రనుండె.

మఱియు

క. పరమేశుఁ బాసిశాంభవి
గిరిపుత్రిక యగుచు శీతగిరి సవిధమునం
దురుతర తపమొనరించెడు
పరమేశుని భర్త గాఁగఁబడయుట కొఱకై.

కావున నీవా రజతాచలంబున కరిగి యందు వైరాగ్య చిత్తు
డై వర్తించు చంద్రశేఖరుని చిత్తంబంబుజాస్త్రప్రహారంబులఁ జ
చలతా యత్తంబు గావించి సత్వర మద్రిజాతా సంభోగేచ్ఛ
కుండగునట్టులత్యంత మోహ ముదయింపఁ జేయుము. పిమ్మ
మా యీప్సితము నిర్విఘ్నముగ సిద్ధించును.

మ—[తనలో] అహో! యేమిది? మానాయనగారిది దుష్కరమని యె
చక యిట్టి కార్యంబునకు నన్నేల నియోగింపఁ దలఁచినారు. [ప
కాశముగా నాయనా! నన్ను పితృవాక్య వ్యతిరేకునిగాఁ దలంప
నావిన్నపంబించుక నాలింపుఁడు.

దరువు. రూపకము.

హరునిమీఁద శరము లేయఁ। దరముగునే జనకనాకు
సురచిర తేజుండు సకల। సురవంద్యుఁడు పరమాత్ముఁడు ॥హ
ఎవని కృపామహిమ జగము। లెల్లజయము గాంతునట్టి
శివుని బాణహతుని నోవ్వఁ। జేసి ద్రోహినౌదునె? పుర ॥హ
స్వామియెడల ద్రోహమెవఁడు। సల్పఁ బరము లేదతనికి
భూమిలో నెలకొన్న మోఁది। పురనిలయుని పాదమాన ॥హ

పరమతపోధురంధరుఁడు బాహుబలుం డసమాన ధీరుఁడా
గరళగళుండు మదిస్వశిఖ ఘాతలకాగ్రహ చిత్తుఁడై నను-
జ్జ్వలచుఁల వహ్నినేత్రమునఁ జూచిదహింపక వీడిపుచ్చునే?
హరునెదిరింప నాతరమె? యన్యులకేనియుఁ దాఁక సాధ్యమే?

పుత్రవాత్సల్యమును విసర్జించి పురహరునిపై కాలంబున కరుగుమనుచుండుట చూడ బలాత్కారంబుగ నన్ను మృత్యుదేవతా వక్త్రంబునకుఁ జేచేతఁ ద్రోయఁ బూనుచున్నట్లున్నది.

ష్ణు—అయ్యో! కుమారా! ఎంత వెఱ్ఱివాఁడవు? నీకుభంగ పాటొదవిన నాకుమాత్రముకాదా! నిశ్చయముగ నిదిఘోర కార్యమయినచో నిన్నుఁ బుత్తెంచుటకు నేనంత వివేకశూన్యుండనా? దేవహితార్థ మాచరించు కృత్యమునకు మృత్యుంజయుఁడు మాత్రము నిన్ను సంహరించునా? అట్లెన్నండును దలంచుకొనక యిటువినుము.

ఆ. వె. పుష్పవితతితోడఁ బూజచేసెడుమాడ్కిఁ
బుష్పబాణచయముఁ బూనిహరుని
దేహమెల్ల నింపి దేవకార్యముఁదీర్పు
మమలకీర్తిశాలి వౌదువీవు.

కుసుమార్చనంబన శంకరున కత్యంత కుతూహలంబు కావున నీకుసుమాస్త్ర ప్రహారములకాగ్రహింపక ప్రసన్నవదనుఁడై ప్రసూనార్చనముగ భావించి సంతసించును. ఇంచుకేని సందియము లేదు.

మన్మ—కందార్థము. కుసుమాస్త్రంబులు వైచినఁ
గుసుమార్చనమటులఁ జంద్రకోటీరుఁడు సం
తసమందు నంచునుడివితి
వసమాత్రుండప్రియములఁ॥ కలుగకయున్నె॥

మిూఁగతి నాడుట చన్నేఁ తొలి ధేనుగణములు తోరంబు క్షీరముల నభిషేకముఁ బొనరించి నంతనె॥ యలుకపూని తదీ పశుగణంబులను గరుణా హీనుఁడై తన। జ్వాలన నేత్రజ్వాల కిం ములుగఁ జేసినయతఁడు దీనికి ॥నలు॥ కుసుమములుగా గాక ద ములు సహితమభవాభీష్టకరంబులుగా భవాదృశ బుధులెందఱో క్కాణించుచుండుటయు గాని భావహీనకృత్యంబెన్నండేని ఫాల చనుఁ డంగీకరించినట్లు తెలియంబడదు తొల్లిదేనుసంఘములకే త కుతూహలమున శితికంఠునకు క్షీరాభిషేకము గావించియ దత్క్షణ మాతని నేత్రాగ్నిల జ్వాలల దగ్ధములైనట్లు మాత్రి విస్పష్టమగుచున్నది.

దేవేం—పంచాయుధా! పరమేశ్వరునకు క్షీరాభిషేకము గావించిన బశుగణము నిర్మూలింపఁ బడినదేమి?

విష్ణు—కుమారా! ఏదీ? ఆకథావిధానంబెఱింగింపుము విని మెదము.

మన్మ—నాయనా? మున్ను కశ్యప ప్రజాపతి వరుణునిచేఁ బడసిన ధే పంచయమును దనలోకమునకుఁ దోకొనిపోవుచుండఁ బతసహి బులైన తద్ధేనువులంబరంబున స్వేచ్ఛావిహారంబులఁ జెలంగుచుఁ క్షీరధారల నఖండబుగ వర్షింపసదీనద తటాకములు పరిపూర్ణ లగుటయేకాక మంధరాద్రిపై వసియించియుండిన మహేశ్వర మిూఁదసహితము క్షీరవర్షము కురిసినది. అది శంకరుఁడప్రియము దలంచి కోపవీక్షణముల నీక్షింపఁ దత్ క్షణమాపశువ్రాతంబు భస్మీభూతంబులై నేలఁ గూలినవి. కావున నేనాహరుని మెది భావహీనకార్యమాచరించుట కెట్లరుగఁ గల్గుదును?

దరువు. త్రిశ్రగతి. సావేరి

పోఁజాలను నాయనా। హరుని మిూఁద దురము సేయుటకునే ॥ప॥

వహీనకార్యమాచరించిన। ఫాలలోచనుండు సమ్మతింపఁడు
ప్రవగానరాక యుండుఁ గనులకుఁ। దాటుప్రాటులాడవఁ
దొడఁగుఁ గాళ్ళకుఁ ॥జో॥

ృవాక్యపాలకుండఁ గానని। ప్రేమపీడవలదునుమ్ము నాయెడ
తిప్రిలోన మోరినగర నిలయుని।
దాఁకఁబోవుటనలములోఁ దూఁకుట ॥పో॥

సీ. పోవఁగాఁ జాలను బోయిన శశిమౌళి
సందర్శనంబాట సాధ్యపడదు
సందర్శనంబైన సాన్నిధ్యముననిల్చి
చాపంబుచేఁబూన జంకుపోఁచుఁ
జాపంబుపూనిన శస్త్రసంధానంబు
గావించుటెంతయో కష్టమగును
శస్త్రసంధానంబు సల్పిన గుఱినిల్పి
సుడి వోవకుండఁగా విడుచుటగిది
విడిచినశరంబులాతని విమలహృదయ
నిలయమునఁ దాఁకుసద్దాన నలుకవొడము
నలుకయేగల్గ నిటలనేత్రాగ్నికీల
దగ్ధుడ నగుటగాక యేదారిగలదు?

ఆకారణమున నాకు భీతి జనించు చున్నది కావున నానేరము సైరించి నన్ను భవుని మీఁది కనుపకుఁడు

ప్రిహ్మ—దర్పకా! హరిసురేంద్రాదిద్య మరులును నేనును నిన్నీకా ర్యార్థము ప్రార్థించితి మనియైనఁ దలంపక హరుఁడసమాన రా దుర్రిఁడనియు నతనిమీఁది కరిగిన ద
టిపే.



ఉ. ముప్పదిమూఁడుకోట్లసురముఖ్యులు పొందెడు దైత్యబాధలం
దప్పక మాన్పనెంచి గిరిధన్వుని నీశ్వరునద్రిజాతతో
నొప్పుగఁ గూర్పఁబూనుటకు లొయ్యనఁ జారుశరీరమంతటం
గుప్పెడునిన్నుఁ గోపమునఁ గాల్చునె? శంకరుఁ డంతమూఢుం

పరకార్య నిర్వాహకుఁడవైన నిన్నుఁ బరమేశ్వరుఁడు బాధిం
డు కావున నీవరిగి మాకోరిక నెరవేర్పుము

మన్మ—నీరజాసనా! మీరెంత ప్రోత్సాహపఱిచినను నామనంబీ
రునిమీఁది వైరంబున కంగీకరింపకున్నది.

చ. వలసినసర్వలోకముల వారని మత్కుసుమాస్త్రధారచేఁ
గళవళమొందునట్లధిక కామ వికారముఁగల్గఁజేతుని
ర్మలహృదయారవిందులగు మౌనులనేనియు భంగపుత్తునా
మల హరుపైశరంబులిడ మానసమొప్పదు పద్మసంభవా.

ఈశ్వరుని దక్కఁ దదితరుల నేరిని జయింపుమన్నను అనాయ
సంబుగ నొక్కత్రుటిలో జయించి వచ్చెదను. సకలచరాచర జం
జాలములను మచ్ఛరాహతిఁ గుందని దొక్కటియేనిఁ గలద
మున్న ధర్మాత్మ ధర్మకోవిదులగు మహానుభావుల నెందఱను
ద్బాణప్రహారములచేఁ బరనారీలోలురఁగఁ జేసితిని? చూడు

చ॥ అరుదుగదారుకావనము నందలిమౌనులనెల్ల మోహినీ
సురతముఁగోరఁజేసితిని, సుందరిమేనకనత్తపోధురం
ధరుఁడగుగాధిపుత్రునకుఁదార్చితి దాసకులాంగనంబరా
శరునకుఁగూర్చితింగుసుమసాయకధారల నంబుజాసనా!

మఱియు

సీ. సంజ్ఞతోఁబలెనహస్కరునకుఛాయతో
నియమించితిని గేళి నేనకాదె?

కుముదినీమిత్రుని గురుపత్నితోఁబొందఁ
గా నొనరించితి నేనకాదె?
హరికిజలంధరాసురభామినీపొందు
నిరతిగావించితి నేనకాదె?
గౌతమభార్యతోఁ గవగూడఁజేసితి
నిర్జరనాథుని నేనకాదె
వరుణసతిమీఁదనగ్నికివలపుగలుగఁ
జేసితినిగాదె? యింక వేయుచెప్పనేల?
పుష్పబాణంబులెదనాటి పుత్రితోడ
నిన్ను నెనయించినదియును నేనకాదె!

ఎంతెంతకార్యంబులేసియు వెనుదీయక సంతోషంబున నమకూర్చుచుండెడు నాకిపుడు హరుని మీఁదికరుగుమనిన నధిక భయంబుదయించుచున్న దేమి సేయుదును.

—ఓరీ పరమభీరువా? మన్మథా! నీవింత పిఱికిసందవని యెఱింగినచో మొదటనే నిన్నుఁ దలంపకయుందుమే. జగదేకవీరుండవనియు దంపతీయోగ సంఘటనకారకుండవనియు నెంచి నిన్నిటకు రావించినందులకుఁ బితృవాక్యోల్లంఘన మాచరించుటయే కాక సురశ్రేష్ఠులమగు మమ్ముల నేసియు గణింపకున్నాఁడవుగా?

దరువు: రూపకము—కమాచి.

ోకేమన్మథ! మేరాయిటులాడ నీకు॥ ॥నా॥
రెకుముల్లోకములను సాధించెనని మొదవా
ారత్వము ధీరత్వముఁ జూపకిటులఁ బలుకఁదగునె॥ ॥యో॥
ాదంబుధిలోమున్గిన విబుధులదరిఁజేర్పఁదగిన
ిఁడవని నినుదలఁచి నిష్ఫలమని చెప్పుచుంటివి. ॥నా॥

ధారుణీ శ్రీమోహనగర! ధాముఁడగు సర్వేశుని
కోరిన క్తునిజేయఁ గాలేననివచియించెన

గీ॥ ఏనుజగదేకవీరుండ నెట్టికామ
హీనుసేనియుఁ గుసుమాస్త్రమదనునాటి
కాముఁగనిజేయఁ గలనను గర్వమూని
తిరుగుటయె కాని హరునిపై కరుగవుగద!

పేరుప్రతిష్ఠలు రాని నిరర్థక కార్యములెన్ని యొనర్చినను శా
కీర్తనీయమగు సార్థక కార్యమాచరించుటతో సాటివచ్చునా
ల్పజ్ఞానసమేతుల నెందఱనో యన్యకాంతాలోలురఁ జేయుటక
బరమజ్ఞానైకచిత్తుని శంభుని బార్వతీ సక్తునిజేయుట యుత్తమ
అట్టి యుత్తమకార్యమునకుఁ గాదే యింద్రాదిదేవతలును మే
ను విన్నవించుచున్నయది? అర్థిజనులువచ్చి వేఁడుకొన్నప్పు
ప్రాణంబులేనియు నిచ్చి రక్షించుట శూరధర్మముకదా! నీక
ణంబేల కలుగకుండవలయు? ఇంగితజ్ఞానమెఱుంగని పశుపక్షిప్ర
ములు సహితముఁ బరులకు హితమొనర్చుచున్నవుకదా ప్రాజ్ఞుం
గు నీకుఁ బరోపకారబుద్ధి యేల జనింపదు? శూరుండననియు,
దేక వీరుండననియు విఱ్ఱవీఁగుచున్నాఁడవు గాని యానామముల
ర్థమెట్టిదియో యెఱుంగకున్నాఁడవు. ఆర్తజనరక్షణము సేయ
నీశూరత్వమును శంకరునిజయింపఁ జాలని నీజగదేక వీరత్వము
నెట్లు సార్థకమగును? మనోన్మత్తుఁడవై యొకలెఱుంగక మా
క్యోల్లంఘన మాచరింప నెంచినంత మాత్రమున విస్మారక
చెడననుకొంటివా? లెమ్ము. శీఘ్రమె ధనుర్బాణధరుఁడవు కమ్ము
హరుని విడిదికి దుర్గమునకుఁ బొమ్ము.

మన్మ—[తనలో] ఓహో! యీబ్రాహ్మణుఁడు కొంతకొంత కాగ్రహ

ధికమగుచున్నది. ఏమి సేయుదును ? (ప్రకాశముగా) చతురాననా! సకల ధర్మాధర్మకోవిదులరగు తమరు సహోకమాగ్రహచిత్తులరై యూరక నన్నేల నిందింపెదరు?

ఆ॥ వె॥ చంద్రమౌళితోడ సంగ్రామమొనరింప
శక్తి చాలకునికి సంశయింప
వలసివచ్చె ఋషులవాక్యముల్ జవదాట
వలసె, నిందపొందవలసె నిపుడు॥

దేవేం—మన్మథా! చతుర్ముఖుఁడు నిందించుచుండెనని శంకించుచున్నాఁడవా?

క॥ పదుగురకు నిష్టమగుపని
నిదియదియని సంశయింప కీర్చినచోఁ
బదువురు సంతస మొందుదు
రది సేయమి నింద సేతు రందఱు వానిన్॥

కావున నీభయసంశయములు వర్జించి పరమేశ్వరుని బార్వతితోఁ గూర్చి మమ్ముల ధన్యులఁ జేయుము.

మన్మ—బృందారకేంద్రా! మీరెందఱెన్ని చందముల బోధించినను నాడెందంబిందు శశాధరవిరోధంబునకు సందేహించుచున్నది గాని సాహసించుచుండుట లేదు. అయినను మీరాచరించు ప్రయత్నము శూరపద్మాసురబాధా నివారణార్థమే కావున.

ఆ॥ వె॥ సెలవొసంగుఁ డేను శీఘ్రగతినిబోయి
శూరపద్మదనుజ సుతకళత్ర
బంధుసఖులతోడఁ బట్టి సంగరములో
శత్రుహాతునిజేతు క్షణములోన.

మత్తయు సద్గురితహృదయుని శూరుని మతిభ్రష్టునిజేసి గర్వ

లకుఁ దానేర్పరచిన నీచకృత్యములకుఁ బ్రతిక్రియగాఁ దండము
ఘోరతమములఁ దానే పొర్లాడుచుండు నట్లొనర్చి చనుదెంచెద.
యుంచి పుత్తెంచుఁడు.

బ్రహ్మ—ఓహోహో! దర్పకా! యేమి నీదంధవాక్యములు? సా
తజ్ఞానుఁడగు శంభుని సన్మోహనాస్త్రముల నేయంజాలక కూ
స్వభావుఁడగు శూరుని బుత్రమిత్రసహితంబుగా శస్త్రహతు
యుదునను చున్నాఁడవా? ఆహా! నీవైఖరిఁజూడ నెద్దియో
న్నితప్పించుకొనఁ జూచుచున్నట్లున్నది. కాని నీచేత నేనీకార్య
చేయుంపక విడిచెదననుకొంటివా? చూడు.

ఉ॥ శూరవినాశనార్థమయి సోమకళాధరునాదిదేవునిన్
భూరిపరాక్రమస్ఫురణఁ బుష్పశరాహతి నద్రిజాతితో
గూరుపుమన్న నీకొనరికూర్మిని నిన్ను మదీయతీవ్రదు
ర్వార మహోగ్రశాపమున బాధితుఁజేయక యూరకుందునే?

మదోన్మత్తచేతస్కుండవగు నిన్నిదే శపించుచున్నాఁడ
నిలునిలువుము.

విష్ణు—ఆఁ-ఆఁ-బ్రహ్మదేవా! త్వరపడకుము త్వరపడకుము. భీ
తస్కుండగు నీబాలుని ధైర్యపఱచి పంపించుటకు మారుగా
గ్రహించి శపించుచున్నాఁడవా? ఉండుముండుము. నేనీతని నో
చి పురాంతకుని పైకిఁ బుత్తెంచెదను.

బ్రహ్మ—చిత్తము.

విష్ణు—కుమారా! త్రియత్రింశత్కోటి నిర్జరసంరక్షణార్థమై కదా
కరు నద్రిజానక్తుని జేయుమని శతమఖాదసురలును మేమును
న్నాఁ బ్రార్థించుచున్నది? అది నీకుఁ జేతనైన కార్యమయ్యెను చే
నొల్లకుంటుట పాడి యగునా? ఆపన్నులయుంబునఁ బ్రార్థింపఁబే

లుపోయి యూతఁడలఁ గాపాడుట యుత్తమలక్షణము. అట్టి యుత్తమగుణముగల నీకు వేఱ యొఱింగింపవలయునా? ఎట్లైనఁబోయి శంకరునిపైఁ గుసుమాంబకములఁబ్రయోగించి సత్కీర్తిఁబడయుము. లేనిచో నీ పద్మసంభవుఁడు ఘోరంబుగ నిన్ను శపించును శాపగ్రస్తుండవగుట కష్టమని నీవెఱింగినదే. పిమ్మట నీయిష్టము.

మన్మ—(తనలో) అయ్యో! యేమిది? యిట్లువచ్చినది. ముందునకుఁబోయిన నూయియు వెనుకకు మఱలిన గోయియువలె నీసురశ్రేష్ఠుల యానతివడసి హరునిపైకి దురంబున కరిగినచో నన్నతఁడు తప్పక తనఫాలనేత్రానల జ్వాలల భస్మము గావించును పోవనిచో నీచతురాననుఁడు ఘోరముగ శపించును. ఏమి సేయుదును. (యోజించి) కానిమ్ము. ఎటనుండియెటు వచ్చినను చందనసుగంధద్రవ్యలేపనములచేతను చంపక పారిజాత కుసుమంబులచేతను మణిమయ సువర్ణాభరణంబులచేతను నలంకృతంబయిన యీకోమలశరీరము నిష్కారణముగ శతధృతిశాపాధీనముచేయుటకన్న దేవకార్యార్థము దేవదేవనిటలానల జ్వాలల కర్పించుట శ్రేయము కావున నేనిప్పుడే హరుని మీఁదికి దురంబున కరిగెదను (ప్రకాశముగా) అమరశేఖరులారా! మీయభిమతంబీడేర్పఁ గృతనిశ్చయుఁడనైయున్న నన్నందరు కరుణార్ద్రహృదయులరై యాశీర్వదించి పురహరునిపైకిఁ బుత్తెంచుఁడు. ఇంతవఱకు నీయకొనని నన్ను క్షమింపుఁడు.

విష్ణు—కుమారా! నీకభ్యుదయమగుఁ గాక పోయిరమ్ము.

దేవేం—వీరవరా! నీకు విజయంబుగలుగుఁ గాక. అరిగిరమ్ము.

బ్రహ్మ—మన్మథా! నీకుమంగళము చేకూరుఁగాక. ఏగిరమ్ము.

మన్మ— చిత్తము (అని నిష్క్రమించును)

విష్ణు — ఇఁక మనము మనప్రయత్నములలో నుందము రండు.

బ్రి–ఇం — చిత్తము. (అందఱు నిష్క్రమింతురు)

[రతీదేవి సఖులతో — ప్రవేశము.]

దరువు ఆది — పంతువరాళి.

సదమలచారిత్ర సాధ్వి రతీదేవి ||స
మదనునిరాకకై మదిని యోజించుచుండి ||స
ఉదయముపోయె నిర్జరోత్తముల్ దలఁచిరనుచు
నిదివఱకు రాకున్న హేతువెద్దియోయనుచు ||స
ఏమియుపద్రవ మేగుదెంచెనో కాని
సామివేఱుచోటఁ జాలము సేయఁ డనుచు ||స
వరుఁడు క్షేమంబుగ వచ్చి చేరునట్లుగ
ధరణిశ్రీమోరపురధాముని వేఁడికొనుచు ||స

రతి — సఖులారా! నేఁ డుదయమున నాహృదయేశ్వరుఁడు నన్ను జేరఁజేరి.

క॥ సురవరులు దలఁచుచుండిరి
త్వరితగతిం బోయి వత్తుఁ దరుణీ! యనినా
కెఱిఁగించి చనివిభుఁడీ
వఱకున్ రాఁడాయె నేమి వాటిల్లెనొకో!

నిమిషమేనియు నాపిమోగంబున కోర్వఁజాలని నాప్రాణవల్లభుఁడు నేఁ డాలసించుటకుఁ గతంబేదియో తెలియకున్నయది.

సఖులు — అమ్మా! యిల్లుగడచి బయలు దేరిన పిమ్మట వెంటనే తి
గివచ్చుటకు మనయిష్టము కానాగునా? కార్యార్థమై యేగినప్పు
డెద్దియేనిఁ గారాణాంతరమున నాలస్యము కావచ్చును. అయిన
నీనాథుఁడు వచ్చెడివేళ పూర్తిగ మిగిలియుండలేదు. కొంత సేపటి
కేనియు రావచ్చును. విచారము మానుగుము.

తి—సఖులారా! యీయాచారమిప్పుడు వదలునది కాదు. నాప్రాణేశ్వరుని యాలస్యకారణము తెలిసికొనునంతవఱకును నన్నిది తప్పక బాధించునదే. కావున మీరెల్లరుం దత్కారణమునకై.

దరువు—ఆది.

లోచింపరె సఖులారా! విభుఁ। డాలసించియున్న కారణముమీ॥రా॥
శాఖఁజాలనొక్కనిమిష మేనియు। ధవునిగన్నులారఁ గాంచకుండిన॥నా॥
సుర శేఖరులెల్లరు నానాథుని। శూరాదులసంహరింపఁ బంపిరో
రణిమోరినగర నిలయునిపుడగ। తనయతోడఁగూరిచిరమ్మనిరో॥యో॥
॥ రోజన సేయ సేసఖ కులోత్తమలార! సుపర్వశేఖరుల్
మోజనసల్పి నాథునినుద్ధృతదైత్యవినాశనార్థమై
యాజికిఁబంపిరో హిమనగాత్మజఁ బెండిలియాడునట్టులా
రాజకళాధరుఁ సుమశరంబుల నేయుట కాజ్ఞయిచ్చిరో!

అయ్యో! యేమిది? చెలులారా! నాదక్షిణ నేత్రమదరుచున్నది నానాధుని దప్పక దేవోత్తములెద్దియో దుష్కర కార్యమునకుని యోగించి యుండవచ్చును. లేదేని నాకిప్పుడీ యశుభసూచకంబేల సంభవించును.

ద్విపద ఏమిసేయుదు నింక నెలనాఁగలార!
నామదికలఁత చేనవయుచునుండె
ధవునివిషయ మేనుదలఁచుచునుండఁ
గవకవపలికెను గౌళిపైనుండి
యెదురుగాఁదుమ్మిరి యెవ్వరోకాని
అధరఁదోడఁగెదక్షిణాక్షియువ్వేళ
ఈమున్నెమిత్తంబులువీక్షింపవిభున
కేదియోవిధిలేని యిక్కట్టుదోడరి

దిగులొందుచున్నట్లు తేలుచునుండె
పగగ లైమామీఁద భగవంతుఁడకును.

సఖులు— అమ్మా! లేనిపోని యనుమానములచే నీహృదయమున కే
మఱింత కలంత దెచ్చి పెట్టుకొని యెదవు? నీధవుని నిజవృత్తాంతమ
దెలుసుకొనక యిత్తెఱంగున దురపిల్లుచుండుట న్యాయమా? ఊ
డిల్లుమూఁ అడిల్లుము.

రతి— చెలీ! శకునఫలముల మోఘములని శాస్త్రములు ఘోషించుచు
డవిని యుండియు వేఱ నిజవృత్తాంతం బారయువఁ యయునా? పోనిమ
నీవాక్యానుసారముగాఁ దెలిసికొందమన్నను మన్నాథుని దర్శనమి
కను లభింపకున్నది. యెట్లూఁ అడిల్లుదును.

సఖి— [పక్కకుఁజూచి] అమ్మా! మాటలోనే నీపతివచ్చుచున్నట్ల
న్నాఁడు చూడుము.

దర్బు ఆది పున్నాగ.

ఏఁడే నాప్రాణనాథుఁ డెటనుండి వచ్చుచుండె ॥నె
రాఁడాయె నేపోయి రయమున దోడితేవే ॥యే
వచ్చెను ధవుఁడన నంతకొంతతోలంగె
మచ్చకంటిరో యింక మసలుచున్నావేమె ॥యే
సురుచిరగాత్రుని జూపింపవేమె చెలి
ధరణి శ్రీ పొరిపురధాముని గొల్తునన్న ॥నె

నెచ్చెలీ! నీకు నాతోఁ బరిహాసమా? యేఁడీ నానాథుఁడు వచ
చున్నాఁడంటివి? యెచ్చటనున్నవాఁడో చూపుము.

సఖి— [నోరుచేతితో మూసుకొని] రతీ! యెంత మాటాడితివే? నీ
నేనన్నఁడేనిఁ బరిహాసమాడితినా? చూడుమాప్రక్కకు.

క॥ చిలుకల పలుకులు కోకిల

కలనాదము లళులమ్మాదుల గానంబులు మం
గళరవములట్లు సెలఁగఁ
జలరాజదేరథము నెక్కి వచ్చుచునుండెన్

రతి దేవీ! నామాట పరిహాసమనుచుంటివి కాని ఆ వచ్చెడిసుం
దరాంగుఁడు ప్రియనో వారుఁడానో కాఁడో నిదానించుము.

రతి—[నిరీక్షించి] సఖీ! నిశ్చయముగ నాప్రాణేశ్వరుఁడే వచ్చుచున్నా
డు. ఇఁక నేను ధన్యురాలనయితిని.

[అంత మన్మథుఁడు ప్రవేశించును] దర్వు—ఆట.

పంచశరుఁడరుదెంచును దనభార్య చెంతకుఁ ॥బం॥

పంచశరుఁడరుదెంచు నిర్జర ప్రభువులిడిన యనుజ్ఞ రతితో
పంచితంబుగఁ దెలిపితత్కార్యార్థమై పైకంబరుగఁగా ॥బం॥

శరణిసోరిపురీశుని వీరభద్రి వరమునిఫాలాక్షుని
సురమునం దెదిరింతునవఁగా సురభయంబునఁ బ్రాణనాయిక
సురమువలదని మందలించున్ సరగునవీకోనునోయనుచును ॥బం॥

రతి—[మన్మథుని సమీపించి]

ఆ॥ వె॥ ప్రాణనాయక! తమపాదపద్మములకు
వందనంబు సేతు వాంఛ దీర
నమరవరులు దలఁచిరని యోఁగింత సే
పాఁగియున్న హేతువానతిండు.

ప్రాణవల్లభా! మీరెవ్వడెచ్చటికే గినను దిరిగి సత్వరము రు
దెంచెడి వారే? ఈదినంబున నింత కాలస్యమేల చేసితిరి? అమరవ
రులు మిమ్మేద్దియేని దుష్కర కార్యమునకు నియోగించిరాయేమి?

మన్మ—ప్రాణేశ్వరీ! నీకావిన మెఱిగింపవలయునా? ఇదిగో వినుము.

ఆ॥ వె॥ ఏనునిన్ను వీడి హేమాద్రిపైనున్న

హరిముఖాద్యమరులదరికిఁ జనఁగ
నన్నువారుగాంచి యెన్నరానిప్రమోద
చిత్తసరసిజులయి చెలఁగిరబల!

రతి—నాథా! కోరుచుండిన తమదర్శనములభించినపుడు నవీనభు
లు సంతోషించుట సహజమేకదా! తరువాత?

మన్మ—తరువాత నన్ను సుఖాసీనుఁజేసి హరిబ్రహ్మేంద్రులుఁ
థా! శూరపద్మవధార్థ మైసుతుని బుట్టించెదనన్న శంకరు
రజతాచలమున విరక్తచిత్తుఁడై వర్తించుచుండె. దాక్షాయణి
హిమాచల పుత్రికయైశర్వరి సరాణ్యాంబునఁ దపించుచున్న
కావునఁగుమారోదయుంబుకొఱకు వారిరువురను గుసుమాంబక
నొప్పించి సంఘటనము గావింపవలయు” నని సెలవిచ్చిరి.

రతి—(అత్యంతవిషాదముతో) అయ్యో! ఎంతకష్టము ఎంతకష్టము న
నే ననుకొన్నట్లే జరిగినది. లేదేని నాకీదుర్నిమిత్తములేల పొడ
పును ప్రాణేశ్వరా! మీరందులకేమి ప్రత్యుత్తరమిచ్చిరి?

మన్మ—ఇచ్చుటకేమున్నది?

క. వలసినఁ బదునాలుగు జగ
ములనైనను సురసుతుల మువ్వురనైనం
గలిచెదను క్షణములోపల
మలహరు నెదిరించుటనిన మదితల్లడిలుఁ ॥

అని యెన్నోవిధములఁ బ్రార్థించితిని గాని, యందు బ్రహ
వుఁడు ప్రళయకాలరుద్రునివలె మండిపడుచు నన్ను ఘోరం
శపింపఁ బ్రయత్నించె.

రతి—ఏమీ? ఆబ్రహ్మదేవుఁడుమున్ను నృతకోపంబున నీశ్వరు
శపింపఁబడియు లజ్జావిహీనుఁడై శంకరవైరంబునకు భయంప

...న్న మిమ్ము శపింపఁ బ్రయత్నించెనా? నాథా, అపు డేమిజరిగినది?

...—అప్పుడు విష్ణుదేవుఁడు బ్రహ్మను మందలించి దేవకార్యార్థ మీశ్వరుని గుసుమాస్త్రహతుని జేయక తప్పదని నాకెన్నియో నీతు లుపదేశించెను.

—నాథా! బ్రహ్మను మందలించిన విష్ణుదేవునికిఁ గూడ నదియే బుద్ధిపుట్టినదా? తా నవతారపంచకంబున నరివీరుల సంహరించి ప్రమత్తచిత్తుఁడై వర్తించినప్పుడు తనకుఁ దగిన శాస్తిచేయించి శాంతుని గావించినది శంకరుఁడే గదా చూడుఁడు.

సీ॥ మత్స్యమై సోమకు మదమడంచిన నాఁడు
  నేత్రముల్ పెఱికించి నొగడె నెవఁడు
కమఠమై మంథరగ్రావ మెత్తిననాఁడు
  కనుజిహ్వదీయించె పేర్కొ నెవఁడు
పోత్రియై కనకాక్షుఁ బొలియఁ జేసిననాఁడు
  కోఱలు లాగించి కొఱలె నెవఁడు
నరసింహమై హిరణ్యకశిపుఁ గూల్చిన
  తఱిఁ జర్మమొలిపించి తనరె నెవఁడు
  పొట్టియై బలిఁ బాతాళమునకుఁ ద్రొక్కి
  నవుడు వెనుపూసఁ దీయించి యలరె నెవఁడు
  అట్టి సర్వేశ్వరుని సత్వమఖిల మెఱిఁగి
  వానిపై కరుగుమనెనె శ్రీవరుఁడు మిమ్ము?

ప్రాణేశ్వరా! పుత్రవాత్సల్యవిరహితుఁడై పలికిన పురుషోత్తమ వాక్యములకుత్తర మేమిచ్చితిరి?

...—చెలీ! నారాయణోపదేశము శ్రోత్రపుటంబుల నాటికొనినంతనే హృదయసీమను మితిమీఱిన యుత్సాహ మంకురించి శంకరు

నితో సమరమొనర్చుటకు సమ్మతించితిరని జనకునితో వచించితి

రతి— అయ్యో! నాథా ముందువచ్చెడు మార్గము దెలిసికొనక చె

తండ్రు జనకుఁడు కదా యని విష్ణుదేవునివాక్యములు విశ్వసించి య

త్యజనదుస్సాధ్యుండగు నభవునితో నని సేయుటకంగీకరించితిరా

ఎంతపనిచేసితిరి?

ఆ॥ వె॥ వృక్షమునఁజిక్కి వయివేసికొనెడుకీతి
నదిరి కేలఁబట్టి యూఁపెడు క్రియఁ
దగనిభారమిటులఁ దలఁదాల్చి యున్నారి
కేమియగునొడుదాన నిపుడు మిమ్ము॥

ప్రాణేశ్వరా! అంతటి యసాధ్యకార్యా చరణమున కనుమతి

పవచ్చునా ?

మన్మ— అతివా! యదియసాధ్యకార్యమని యెఱిఁగియుండియే యను

మతింపవలసి వచ్చినది. ఏలన:

క॥ సలిపెడిది దేవకార్యము
నలుపఁగలేనని బ్రహ్మశాప్యంబట్టుపై
నలుపుమని పలుకుచున్నది
కలికీ! జనకుం డదెట్లు కాదనఁ గలనే?

ఈకారణముల వలన నియ్యకొనక తప్పినది కాదు.

రతి— నాథా! అట్లయిన విరారభవునిపైకి దురింబున కరిగెదరా ?

మన్మ— నిశ్చయముగ నరిగెదను.

రతి— అయ్యో! శంకరుఁ డసాధ్యుఁడని యెఱింగి యుండియు నత

తోఁ గయ్యమొనర్ప నేగుటకు సాహసించితిరా ? అతని మీరు

యింపఁగలరా? చతుర్దశభువన వాసులలో శంకరుని జయింపఁగ

సమర్థుఁడొక్కండేనిఁ గలఁడా ? మా స్వతని కప్రియవర్తనులై

రించిన మహామహుల నెందఱి నాతఁడు శిక్షించియుండలేదు? చూడుఁడు.

సీ॥ భక్తుఁడౌ మార్కండబాలుని గొంపోవు
దండపాణిం బట్టి తన్నినాఁడు
తనకుఁ బోలె నయిదు తలలేలయని బ్రహ్మ
శిరము నొక్కండట్టె చెండినాఁడు
తన్ను దూషించినదక్షు ప్రజాపతి
సవననాశనమును సలిపినాఁడు
గర్వోద్ధతిని గన్నుఁగానక చరియించు
హరిని శూలంబున నడఁచినాఁడు
అట్టి జగదేకవీరుని హరునితోడ
నాలమొనరింపనేగుట హరిణశాబ
కంబు బెబ్బులిమీఁదకుఁ గయ్యమునకుఁ
బోవుటయె కాక వేఱేమి త్రోవకలదు?

ప్రాణేశ్వరా! హరునకును మీకును హస్తిమశకాంతరము భేదముండుటయే కాక యతని సమరసాధనములకు మీసాధనములకును నత్యంతవ్యత్యాసము కలదు. చూడుఁడు.

సీ॥ అతనిబాణాసనంబచలమౌ హేమాద్రి
మీవిల్లు జనములు మెసవుచెఱకు
అతనిబాణము మహోద్ధతుఁడగు శ్రీహరి
యంటినఁగములు మీయలరుఁదూఁపు
అతని నారియనంతుఁడగు నాదిశేషుండు
మీనారి చెదరు తుమ్మెదల చాలు
అతనిరథము స్థిరమైన వసుంధర
మీతేరు చలియించు మింటిచూలి

అతని కెక్కుఁడుబలమైన యాలపోతు
మీసడెంబులు జిగిఁదేరి మీనొప్పసళ్ళు
అతనికిని మీకు నేరీతి నన్నియెడలఁ
గలవుభేదంబులెన్నియో కమలబాణ!

కావున నట్టి బల్లిదుని బవరమున నెట్లు మారొ్కనఁజాలుదురు

దరువు : రూపకము—శీలావ.

వలదువలవదేగవలదు వలదుప్రాణవల్లభా
మలహరునెదిరించుటనిన మాటలతోఁ గాదుధవా ॥వల
మీకన్న సహసగతుల పేటిబాహుబలయుక్తుఁడు
తాఁకఁగలరె యాశంభుని దమకేకిడోదవకుండ ॥వల
గిరిచాపము హరిబాణము శరనిధి తూణీరముగల
హరునితోడ దుర మొనర్పఁదర మేమె వ్వారికైన ॥వ
తొలిమినుకులఁగుఱ్ఱంబులు తోయజ జన్ముఁడుసారథి
గలమోరిపుకీశుఁడైన కఱకంఠునితోడఁబోర ॥వ

ప్రాణేశ్వరా! నీవాక్యములు విశ్వసించి నాగకంకణుఁడగు స ర్వేశ్వరునితో సంగరమును మానుకొనుఁడు. ఇంతగా జెప్పుచుంటిని ని యించుకేనియు నాపై నలుగకుఁడు

మన్మ—ప్రాణేశ్వరీ! నీవాక్యములు విశ్వసించి నేనీకార్యమాచరించు ట మానితినేని హరిబ్రహ్మేంద్రాద్యమరులచే నిష్కారణముగాని ద నీయుండనగుదును. ఆడితప్పుట కంటెనధమ జీవనము వేఱొండు కలదా? అట్టియధమ జీవనము చేయుటకన్న దేవకార్యార్థ మీశ రీర మీశ్వరాధీనముచేయుటుత్తమ ధర్మముకదా! చూడు

ఉ॥ ఆడినమాటదప్పుట, పరాంగనఁగోరుట, పిన్నపెద్దలం
జూడక గేలిసేయుట, యసూయతఁజూపుట తోడివారిపైఁ,

జూడక చూచినట్లనభసాక్షి యసత్యపుసాక్ష్యమిచ్చుటల్
గూడవుగోవులం జదువుకూళలకేనియుఁ శాస్త్రినాయకా

కావున

ఆ॥ వె॥ ఏదియెట్టులయిన నేనుశంకరునితోఁ
గలనొనర్చి మోహజలధిముంచి
యద్రిజాతతోడనభవునిగూర్చెద
నత్వరంబెసన్న సాగనంపు.

ఇఁకనీనిరుత్సాహవాక్యములు నివృత్తియోజనములుగనెంచి నా ప్రయాణమున కియ్యకొనుము.

రతి—(తనలో) అయ్యో! యేమిది? మన్మథుఁడు తాఁబట్టిన పట్టు విడువక పరమేశ్వరునిమీఁదికి బవరమునకుఁ బోవుచున్నాఁడు పరమేశ్వరుఁడో యీయనను దప్పకతన ఫాలనేత్రమున భస్మముగావింపక విడువఁడు. ఏమిసేయుదును? (యోచించి) కానిమ్ము ఏది యెట్టులైనను, నేను గూడనీయనతో నరిగి యీయనకుఁగీడొదవకుండ నాశక్తికొలఁది శంకరుని వేడుకొందును.

మన్మ—చెలీ! యేమిది? నిరుత్తరరాలవై యూరక కాలయాపనము సేయుచున్నావు?

రతి—నాథా! కాలయాపనసేయుట కాదు. మిమ్మువిడిచి నేనొక్కర్తుక నిటనుండుటకు భయపడుచున్న దానను.

మన్మ—అట్లయిన నీయుద్యమమేమి?

రతి—నేనుకూడ మీ వెంట రావలయునని.

మన్మ—సరే. సంశయమేల? రమ్ముపోదము.

రతి—చిత్తము నడువుడు (అని నిష్క్రమించి యుద్ధపరికరములతో

రథారూఢులై ప్రవేశించుచున్నారు) ఆది.

వెడలె భార్యతో మారుఁడు కైలాసనగమునకు
వెడలె నిక్షుకార్ముకము వివిధసూనాస్త్రచయము
గడువడిఁదాల్చినీల గళునితోనాలమునకు
పవమానరథమునెక్కియు కీరశారికాపిక రవముల కామ్మనలరియు
భువిని శ్రీమీరినగర భుజగభూషణునితోడ
బవరమొనర్పయత్నఁ బార్వతితోఁగూర్చుటకు

మన్మ—చెలీ! మనమిప్పుడు కైలాస పర్వతసమీపభూములను వ
నారము.

రతి—నాథా! యేదీ? కైలాసపర్వత మెంతదవ్వులోనున్నది.

మన్మ—ఎంతో దూరమా?

మ॥ అదియే నిస్తుల తుంగశృంగము మునీంద్రాదిత్య సంసేవితం
బదియే నుజ్జగదైకపావన మభీష్టావాప్తి సంధాయకం
బదియే పద్మజనందనాళినిగమాంతాభ్యాసనుస్థానమ
య్యది యే చంద్రకిరీటి వాసమగు కావ్యాదీంద్రమజ్జాననా!

రతి—ప్రాణేశ్వరా! మనమీపర్వత మధిరోహింపవలయునుగదా!

మన్మ—ప్రేయసీ! మనమీనగమునకుఁ బ్రదక్షిణ నమస్కారము
చరించి పిమ్మట నెక్కవలయును. కావున నరదమునుడిగ్గుము.

రతి—చిత్తము. (ఇద్దరు రథముదిగి యట్లొనర్తురు)

రతి—మన్మ  దరువు—ఆది

జయజయగిరివర జయరజతాచల
జయజయమునిజన సన్నుతచరణా
జయజయశుభకర సకలసురాశ్రయ
జయజయ పరమేశ్వరవరనిలయా!

వందేయిండ్రిముఖాదితేయ వినుతం వందేజగత్పావనం
వందేసర్వకుజప్రసూన కలితం వందేమునీంద్రాశ్రియం
వందేమోదనికేతనంశుభకరం వందేవిముక్తిప్రదం
వందేయిందుకళావతంసనిలయం వందేసురాప్యాచలమ్

స్మ—ప్రాణేశ్వరీ! మనము పాదచారులమై పర్వతారోహణ మొనర్త
ము రమ్ము.

—చిత్తము (అని యిరువురు పర్వతమెక్కుదురు)

స్త్ర—దేవీ! యున్నగంబునఁ గల పాదపలతావితానము వసంతాగ
మమునకుఁ గాంబోలు నిగనిగలాడు తొగరుచిగురుటాకు జొంపము
లనెగడుచు నెట్లు ప్రకాశించుచున్నదో చూడుము.

సీ. వనరమామణి ముదంబునఁదాల్చు మృదువగు
చెంగావి వన్నియచీరయనఁగ
నామనిఱేఁడు తానాతపంబునకునై
కూర్చిన కెంబట్టుగొడుగనంగ
నర్కాస్తమయమున నపరాచలంబుపై
వ్యాపించుసింధురవర్ణమనఁగఁ
బ్రళయకాలమునఁ బాపసిపాళిశిరములఁ
బరిఢవిల్లెడు జటాపటలమనఁగఁ
బుణ్యకాంతలు సతతంబుభూరిభక్తిఁ
బోలుపుమైఁ దాల్చుకుంకుమపొడి యనంగ
నరుణకాంతులు దిశలెల్ల నావరించి
తనరెఁబల్లవతతులతోఁ దరుచయంబు.

మఱియు.

ఉగాధి. ఇందు వికసించు సుమబృందములయందు మక

రందముల సానుదుసముండగశి నతో్య
నందముగ ఝంకృతులు గ్రింకుకొని వీనులకు
విందొనరఁజేయుచు మిళిందతతులొప్పెఁ.
మందపవమానుఁ డనమానబహుపుష్పశుభ
గంధములు నల్దెసలయందెనఁగ వీచెఁ
ఎందుఁ దిలకించినఁ బురందరమణిద్యుతుల
చందమున నక్షులకునందమయితోఁచెఁ.

ఇదిగాక కీరశారికా కోకిలారావంబులు పాంథరాజికి విరా
లుగఁ జేయుచుండుటయే కాక మత్కాంతల వరిహారలక్షితములగు
రులతాజంతుజాలంబులు తమదంపతీత్వంబు తేటపడసరన సమా
సాంగత్య సౌఖ్యంబుల నంతసింపుచు నంచరించుచున్నవి. కావున
మెడ మిట్టకంటివేల్పునరికట్టి దిట్టతనంబున నట్టిటుకదలనీయక పట్
ట్టి పట్టరాని తమకంబున గట్టురాపట్టి చెట్టఁబట్టునట్టు లనవశ్యంబ
గూర్పవచ్చును. రమ్ము లోనికిఁబోవుదము.

[తెరలో]

ఓ వ్రిమథగణజంతుజాల భూరుహలతానివహంబులారా
తృలారా! ఈమురాత్ముని దర్పంబున కలరిచెల రేగితి లేని మిమ్మందఱ
దండంబున శిక్షించెద. జాగ్రతగా నుండి నేను పోయి వానిఁ దుద
ట్టించివచ్చెదు విధమంతయు నరయుచుండుఁడు.

రతి—(ఆలకించి) నాథా! లోపలనుండి భీకరార్భటులతో నవ్వ
మహానుభావుఁడు వేత్రహస్తుఁడై తొందరగా మనదెనకువచ్చు
న్నాఁడు. చూడుఁడు.

మన్మ—(చూచి) చెలీ! అతఁడే యాద్వారముకడ కాపుండునం
శ్వరుండు. ఏలొకో మనపయిని గ్రూరదృష్టిఁ బ్రసరింపఁ జేయ

వచ్చుచున్నాఁడు.

[అంతనందికేశ్వరుఁడు—ప్రవేశించును.]

ది—ఓరోరి స్వల్పాయుస్సము పేతా! నీతి విహీనుఁడవై మన్నగం బున కేతెంచి నిర్గమన నిశ్చలనిశ్శబ్దనిష్కంపన ప్రమథగణపక్షిజం తుభూరుహ లతావితానంబుల సంచారసంచల నశబ్దనకంపన సం కలితంబులగావించి హరిబ్రహ్మేంద్రాద్యమరుల కేనిఁ జొరదుర్ఘ టంబగు నీపర్వతద్వారము మదీయాజ్ఞావ్యతి రేకుఁడవై గర్వోద్ధతిని గన్నులు తలకెక్కఁ గడువంజూచుచున్న నీవెవ్వఁడవో నిలువుము నిలువుము (అని మార్గమున కడ్డనిలుచును)

న్మ—అయ్యో! యేమిది? చెలీ! నన్నీనందికేశ్వరుఁడు నిష్ఫలకుసు మశరుని జేయుటయే కాక మనల లోనికి రావలదని కూడ శాసిం చి యడ్డు నిలిచినాఁడు. ఏమిసేయుదము?

తి—నాథా! మనమితని యెడల నత్యంత వినయవిధేయతలఁ గనఁబఱ చి సాధువచనంబుల నెట్లయిన శాంతిపఱుపవలయును.

న్మ—అవును. [నందికేశ్వరుని సమీపించి] నందికేశ్వరా! నేను మ న్మథుఁడను నావందనములు గొని నన్ను మన్నింపుఁడు.

ంది—ఓహో! మన్మథుఁడవా? యెంతపొరపడితిని. ఈ మహాకోలా హలంబునఁ గలుగు కోపావేశంబున నిన్ను గుర్తింపలేకపోయితిని. అయిన నీవీనగంబునకు రాఁగతంబేమి చెప్పుము.

న్మ—నందికేశ్వరా!

దర్వు: ఆది—ఖీలావ్.

నవిని విమహా సేనరు పెంచిన। పని చెలి పెదనో దేవాఁగానములప్రోవా। విమలపరిభావా మహానుభావా! ॥మ॥

నయము సురసాత్మజలిడు బాధల। కాగలేక త్రిదశులీశు వేఁడినఁగనిక

రమున శంభుఁడంతఁ బుత్త్రినిగని దనుజులసంహరింతుననుదు
ఘనధైర్యముఁజెప్పి యిపుడు వైరాగ్యంబుఁబూనియున్నవాఁడువా
సనకోలలనాటించి యదిర్జితో । నెనయించినఁగానికాదు కార్య
బనినను దేవతలనుపఁగ వచ్చితి। నాదరింపవే యోమహానీయా

చ. అనయము శూరపద్మదనుజాదుల బాధలకోడి వేలుపుల్
ఘనముగఁ దన్ను వేఁడ నుతుఁగాంచి యరాతులతుత్రిడంతుస
చనియు విరాగుఁడై తనరునట్టి మహేశునకద్రిజాతపొం
దెనయఁగఁజేయ నన్నునుప నేనరుదెంచితి దేవదూతనై.

ఇట్టి దుర్ఘటకార్యము శిరమందిడుకొని చనుదెంచిన సామాన్యు
డను. శరణాగతుఁడను. నన్ను క్షమించి శంభుసన్నిధానంబున క
ననుజ్ఞ దయసేయుఁడు.

నంది—మన్మథా! నాకన్న శివునకు నీవే ప్రియుండవు. నీవలన
కార్యము తప్పక నమకూరఁగలదు. కావునఁ దడయక నీవా
మ ద్వారమున లోనికిఁ బోయితివేని నచట మునిజనపరివృతుఁ
వటవృక్షమూలమునఁ గన్నులపండువుగ శంకరుఁడు సాక్షాత్క
చును. పొమ్ము.

మన్మ—చిత్తము. (అందరు నిష్క్రమించుచున్నారు)

[సనకాది మునిజనసహితుఁడై యోగ నిద్రితో శంకరుఁడును,
ప్రక్కగా రతీ మన్మథులునుఁ బ్రవేశించుచున్నారు]

మన్మ— దరువు : ఆది—ఫీల్వా.

అహాహా! చెలి! కాంచితె శంకరు। నాకారంబెటిరున నున్నదో
ఓహోహో! నిశ్చలాత్ముఁడై తపమొనరనాచరించుచుండెనిచ్చట॥
సనకసనందనముఖసన్మునులు। సరసఁజేరితన్నుఁగొల్చుచుండఁగఁ
గనులఁజూపునాసికాగ్రభాగంబునను నిల్పిచిన్ముద్రవహించెను

...రమైన సంసారసుఖంబులు । సర్వంబును నిష్ఫలంబటంచును
...రుణ మోరిపురీశుఁడు మనమునఁ దక్షిణామూర్తియయ్యెనిట ॥నా॥

సీ. సనకాదిమునివరుల్ తనచెంతఁగఱిచెడు
వేదాంతవిద్యకు వేడ్కఁజెంది
భస్మరుద్రాక్షలు బాగుగా మెయినిండ
ధరియించి యీషణత్రయముఁబాసి
వటభూరుహచ్ఛాయ వ్యాఘ్రాజినంబుపై
వీరాసనంబుతో వెలయుచుండి
జ్ఞానముద్రను దాల్చి చక్కఁగాఁ దనదృష్టి
నాసికాగ్రంబున నాటఁజేసి
సూర్యసోమాగ్ని గతులనుసూత్రిమరసి
యజపగాయత్రి జపమూని యాత్మయందుఁ
జక్రిశోధన సేయుచు శంకరుండు
యోగనిద్రను గూర్చుండె నువిద! కంటె?

అయ్యో! యేమిది? చెలీ! యీచిన్మయాకారుని శంభుని వీక్షిం
చినది మొదలు నాహృదయము చంచలతాయత్తంబై యేమియుఁ
జేయనొల్లకున్నయది. ఇఁక నెట్లో కదా?

దరువు. ఆది. అసావేరి.

అకటకటా ! నాహృదయముచంచలఁ మయ్యెనెట్టులోడఁ గూడునో
కార్యము ॥అ॥
అకలంకునిశంభునివీక్షించిన । దాదియేదితోఁచదాయెమనమున ॥సక॥
...డివడిగానాయొడలిపుడెంతో వడఁకఁదొడఁగెఁదడఁ బడెఁగరపదములు
...డమిలోనమోరినగరనిలయుని పుష్పబాణహతినెటుల జయింతునో ॥అ

క. హృదయముతల్లడమందెను

జెదరెనయనదృష్టి యొడలివిగినన్నగిలెర్
బదములుతడఁబడఁదొడఁగెను
సుదతీ ! నేనెవ్విధమున శూలింగెలుతుర్ .

అయ్యో ! ప్రాణేశ్వరీ ! యిదియేమియింతయోకాని నేనఁత
తకు విగతచైతన్యుండనగుచున్నాను. నాచేష్టలుపహితము క్రమ
మముగా నడఁగిపోవుచున్నది. ఇఁకేమిసేతును (అని నిట్టూర్పు
చి చేతిలో నున్న ధనుర్బాణములు నేల జాఱఁ జిత్రప్రతిమవ
లుచును.)

రతి—(చింతచేఁదనలో) అయ్యోయేమిది? మన్మథుఁడంతకంతకు
గతచైతన్యుఁడనగుచున్నాఁడనని నుడువుచుఁగేలనున్నధనుర్బాణము
నేలజాఱవిడిచి నిశ్చేష్టితుఁడై నిలువఁ బడియున్నాఁడు. ఇఁకనెట్లో కద

చ. వలవదుశూలితో మనకు వైరము మానుఁడినాథ ! యంచు నేఁ
బలికినపల్కులర్ వినక ప్రాణవిభుండిపుడాదితేయువ
ర్యులయుపదేశవాక్యములెయుల్లములోనిడిశర్వుఁగాంచిచం
చలహృదయంబుతో వెడఁగు చాప్పున నివ్వెఱగందెనక్కటా !

సమాధినిష్ఠాగరిష్ఠుఁడై సాధుస్వరూపమునఁ బొడఁగట్టుచు
యీశాంతాకార సందర్శనమునకేయిన్ని వికారములు చెందు
న్నపుడు సమరరంగమున ధనుర్బాణపాణియై రౌద్రాకారుఁడై
చియుండుసీతనితో సంగరమున నెదిర్చిజయముఁబొందుటఁజూడ
ననిగర్భమునఁదిరిగి జన్మించినట్లేయగునుగదా! (ప్రకాశముగా) ప్రా
శ్వరా! నేలనుబోవుదానిని నెత్తిని బ్రాముకొనినయట్లు మీరీజ
మాలిన కార్యమునుశిరముపైనైచి కొని యేలయీలీల నలన
బొందెదరు? రండు ఇప్పుడైనమించినదిలేదు మనముపోయి సుఖ
గాబ్రదుకుదము.

న్మ—(సంజాతచైతన్యుఁడై ధైర్యముతో) చెలీ! యేమిది? నాకై వగలఁబొగలుచు నన్నుఁదిరిగిరమ్మని వాకొనుచుంటివి. శూరవరుఁడైనన్నఁడేనిఁగార్యము సాధింపక యూరక తిరిగివచ్చునా? అది శూరధర్మమా? చూడు

పూనిన కార్యమేదయినఁ బూర్తియొనర్చెడుదాఁక దైన్యముం
బూనక కష్టమానములఁ బాటింపక ధైర్యపరాక్రమోన్నతిన్
మానసమందుఁ బట్టుదలమానక లోకులు తన్నుఁగాంచియ
జ్ఞానునిగాఁదలంతురని జంకక నిల్చెడివాఁడె శూరుఁడౌ.

కావున నేనీ సమయమునఁ బిఱుతివియక బాణాసనబాణపాణినై దైవకార్యము తప్పక నెఱవేర్చి శూరధర్మము నిలిపెదను. అడ్డు చెప్పకుము. చూడుము నాయుద్ధనైపుణ్యము.

తి—నాథా! మీరింతనిష్కర్షముగాఁ జెప్పుచున్నప్పుడు నే నేమి చేయఁ గలదానను అయినను నాదొక చిన్నవిజ్ఞాపనమున్నది దయయుంచి వినియెదనన్నచో మనవిచేసికొనియెదను.

న్మ—చెలీ! వినవలసిన మాటయైనచో వినియెదను. ఏదీ చెప్పుము

తి—నాథా! మీరభవునితోదురము మాననంటిరికదా!

న్మ—అవును. మానుటకువీలు లేదు.

తి—పోనిండు మానకపోయిన మానకుండెదరుగాని మీరు పోరునపుడు శంకరాభిముఖులై పోరకచాటుననుండి మాత్రము పని సేయుఁడు

న్మ—చెలీ! ఇది యూనీయభిప్రాయము. సరి యేయట్లయిన నదిగో నానమేరు భూరుహచ్ఛాయను బొంచుండి శంకరునిపై శరములు వేసెదను. రమ్ము నీవుకూడఁ జెట్టుచాటుననుండవచ్చును. (చెట్టు చాటున కేగి సమ్మోహనాస్త్రము తొడిగి) చెలీ! వింటనమ్మోహ

నాస్త్రముసంధించితి.. గుఱిచూచినమంత్రికంబుగ శంకరుని
బ్రియోగించెదను. (అనిగుఱిచూచి భయంబున) అయ్యో! 
మిది? ప్రాణేశ్వరీ! అకారణముగా దుర్నిమిత్తములు పొడసూ
చున్నవి

దరువు. రూపకతాళము. అసావేరి.

అకటకటా! యేమిసేతు నశుభసూచకములు వొడమె ॥
వికలమయ్యెనాహృదయము। విధియేగతి నుండెనొకో ॥
వామభుజము వామనేత్రము। వడివడిగానదరుచుండె
నేమికీడు మూడునొకో। రొమ్ముగవశముగాకయుండె ॥
ధారుణిశ్రీమోరినగర। ధాముఁడైనట్టి చింతా
వీరభద్రవరుని పై। వైరమె సమకూడునొకో ॥

గీ. అయ్యయో! యేమిసేయుదునస్మదీయ
వామబాహువు వామాక్షి వశముగాక
వడిగనదరెడుఁగీడేమివాటిలునొకో?
తెలియ రాకుండెహృదయంబుకలఁగుచుండె.

చెలీ! యీయశుభసూచకముల వలన నేదేని హానికలుగున
మనమున శంకతోఁచుచున్నను బరోపకారపారీణుఁడనై పరకా
నిర్వాహకుఁడగునేనీ దేవకార్యమెట్లైన సాధింపక తీరదు.

రతి—అయ్యో! నాథా! యింకను వెఱ్ఱియే పడుచుంటిరా?

గీ. పరుల కుపకారమొనరింపఁ బరమధర్మ
మగుటనిశ్చయమగుఁగాక యందుఁదనకు
హానికల్గెడు ననితోఁప మానవలదె?
తనకుమాలినధర్మంబు ధరణిఁగలదె?

నాథా! నామాటలు మీహృదయమున నాటుకొన కున్న

కాని యిందు నిశ్చయముగఁగీడేపాటిల్లఁగలదు. లేనిచో నీసమయమున నిట్టిదుర్నిమిత్తములు పొడసూపవు.

...—చెలీ! యేమిజరిగినను సరే. అన్నిటికి సంసిద్ధుఁడనై యు...ఁడను.

గీ॥ కాంచినాఁడను శంభుని గన్నులారఁ
బావనంబయ్యె జన్మంబు పడఁతి! యింకఁ
జచ్చినను మేలెపోనిని సమరమందు
గెలిచినను మేలెయెట్లైనఁ గీర్తి కలదు.

త్రియత్రింశత్కోటి నిర్జరసంరక్షణార్థము పాటుపడుచున్నాఁడను గాని యీతుచ్ఛశరీరమును కాసించి విగత ప్రాణుండనగుదునని విచారించుచుండుట లేదు. ఏది యెట్లయినఁదప్పక చంద్రశేఖరు నీసారి సమ్మోహనాస్త్రమున మోహపరవశునిగాఁ జేసెదఁజూడుము [అని బాణము ప్రయోగించును]

...—[కోపోద్రేకమున] ఓరోరి సాధుజన తపోభంగకారకా! యెవఁడవురా నీవు? మహోన్మత్తచేతస్కుఁడవై యోగనిష్ఠాపరత్వమున నున్న నన్ను వీక్షించి యించుకేనియు శంకింపక నా కత్యంతాయాసము కల్గించిననిన్ని దే నాఫాలనేత్రానల జ్వాలల భస్మంబుగావించెద నిలువుము. నిలుగుము [అని అగ్ని నేత్రమునఁజూచును]

...—మన్మ—హా! హతోస్మి. హా! హతోస్మి [అని నేలఁగూలుదురు]

...—[తెలివినొంది విభునిగానక] అయ్యో! యేమిది? నానాథుఁడిచటఁగన్పించకుండెనే (పరిశోధించి) అదిగో; శంకరాగ్ని నేత్రానలమునకుఁగాఁబోలు దగ్ధుఁడగుచున్నాఁడు. పొగలెగయుచున్నవి (నాథుని సమీపించి) హా! నాథా! లతాంతాయుధా! యిమ్మేనేలను మరణించుచుంటి విధాత మీనుదుట వ్రాసెనా!

దరు. రూపకము. పీల్వా.

నాథా! నేనెటులమనుదు । నాకిఁకదిక్కెవ్వరుహా ॥నా
సాధుశీలునేత్రాగ్నికి । శలభమవైతివకటకటా ॥నా
నిన్నుఁబాసి సహింతునె! నిమిషమేనిఁబ్రాణనాథా
నన్నుడించిపోతివింక । నాజన్మంబేల కాల్పనె ॥నా
వలదని నేనెన్నిగతుల । వారించినగాని వినక
తులువబోధనములవలనఁ । దుదకీవిధమైతివయో ॥నా
ధరణిలోశ్రీమారినగర । ధాముఁడైనట్టినర్వే
శ్వరుని మీఁదవైరమూని । చావవలసి వచ్చెఁగటా ॥నా

ఉ. హా! శరదిందుబింబముఖి! హా మకరాంక! లతాంతసాయకా
అకలనెల్లఁబోవిడిచి యంబుజజన్మనిశాపభీతినా
వేశముఁజెంది నానుడులు వీనులఁబెట్టక యేగుదెంచియీ
యీశు నిటాల నేత్రశిఖినిట్టుల మ్రగ్గితె? ప్రాణనాయకా!

గీ. నిమిషమేనియు ననుఁబాసినిలువఁజాల
కెచటకేగిన వెంటనే యేగుదెంతు
వకట! యీపేమమంతయు నబ్ధిఁగలిపి
నన్ననాథగఁజేసి పో న్యాయమగునె?

దరువు. ఆది.

అనాథనై నరివారిలోఁజీవన । మకటా! యేనెటునలుపఁగనోపుదు ॥న
జనంబునాదర్శనంబుచేసిన । ఘనాఘమనియీనడింతురిటుపై ॥ననా
ప్రియాణికుల కెదురైతినేని-ఛీ! పాపినియదెసిద్ధమయ్యెనందురు
అహో! నీటిఁబాసిననీరజమటు । లయ్యెనాదుజన్మంబకటకటా! ॥అ
శుభశోభనములఁజూచుటకే గినఁ । జుట్టంబులలో నగుబాటగుహా
అభవుఁడుమారిపురీశుఁడుమన్నలను । సదయత నెడఁబాయఁగఁజేసెఁగటా ॥

ప్రాణేశ్వరా! నన్నువివాహమాడినదాదినా యందొకప్పుడేనిన లుకఁజూపక యత్యంతానురాగంబున సౌఖ్యవారాశిన్తోలలాడించుచునిప్పుడాకస్మికంబుగసందరాని దుఃఖాంబుధిని ద్రోతులార మోహఁబట్టి ముంచిపైచి మీదారి మీరు చూచికొంటిరా?

గీ. మీరెగురురువులు దైవంబుమీరెతల్లి
దండ్రిలును బంధు మిత్రులుతలఁపమీరె
యనుచుమదినమ్మి యున్ననన్నకట! దిక్కు
మాలినవనితగాఁజేయ మంచిదగునె?

ప్రాణేశ్వరా! మిమ్ముఁగూర్చి కంటికి మంటికినేకధారగ నేనంతవిలపించు చున్నను నిప్ప్రయోజనమగుటయే కాక నన్నోదార్చువారును మిమ్ము బ్రతికించువారును గూడఁగానరాకుండిరి. ఇఁకేమి సేయుదును? అయిన నీసూర్యాది దేవతలు బ్రతికింతురేమో వీరిని వేఁడుకొనిచూచెదను.

సీ. సురలపంపునవచ్చి శూలిచేహతుఁడైన
స్వామిఁబ్రోవరె? సూర్యచంద్రులార!
భుజశాపభీతి నరుదెంచి మడిసిన
కాంతురక్షింపరే? ఖగములార!
పరులకై జీవముల్ వాసిన వల్లభు
బ్రతికింపరే? గిరివర్యులార!
పితృవాక్యమును దీర్పఁ బిల్కుమారినభర్తఁ
గాపాడరారె? దిక్పాలురార!
పరులకుపకారమొనరింపఁబరమధర్మ
మనుచు నేఁజేయు బోధనలవలఁద్రోసి
ప్రాణములు వాసినట్టి నాప్రాణవిభుని

దయనుమానుపరె ? పంచభూతంబులార !

అయ్యో ! ఏమినా వెఱ్ఱి ? చతుర్దశభువనాతీతుండును సర్వాం
ర్యామియు భూతదయాపరుండును దేవదేవుండును నగు శంకరు
డు సంహరించినప్పుడు మీరలా! నాధుని బ్రతికించిసన్నుద్ధరించున
రలు ? (అని దుఃఖించును)

నంది—(ప్రవేశించి) ఓపతివ్రతాతిలకమా! నీ వెంతదూరపిల్లినను నీకా
తుని బ్రతికించు సమర్థులిందెవ్వరును లేరు. నీనాథుఁడెవ్వని నేత్రా
గ్ని కాహుతియయ్యెనో యాతఁడేనీధవుని తప్ప బ్రతికించు మహా
భావుఁడు. పొమ్ము. నీవాశంకరుని పాదములపైఁబడి వేఁడుకొన
పడినచో టునఁగ దాతుదకు వెదకుకొనవలయును?

రతి—నందికేశ్వరా ! నాయవస్థఁదిలకించి మీరాకుఁబాడమిన జా
ళింపున నిట్లుపలుకుచుండిరిగాని యీశంకరుఁడు వైరిభార్యవగు న
మొఱనాలకించి నాభర్తను బ్రతికించునా ?

నంది—ఓవెఱ్ఱిదానా! శంకరుఁడు మిత్రశత్రువిభేదము పాటించినిన
రక్షింపఁడను కొంటివా ? అట్లుతలఁపకుము. ఆర్తజనశరణ్యుఁడు
భక్తవత్సలుఁడును, భూతదయాపరుఁడును నగు పరమేశ్వరుఁడు
న్నువేఁడుకొనిన భక్తుఁడెవ్వఁడైనను నీప్సితమిచ్చి రక్షించును.
యములేదు. పొమ్ము. నేనుకూడనీకు సాహాయ్య పడెదను. స
వుము.

రతి—చిత్తము. (అని శంకరుని సమీపించి) దరువు. ఆది.

హా ! పరమేశా ఆర్తశరణ్యా
నావయిఁగృపచే! నాధునిబ్రోవవె
పాపవిమోచన । భక్తజనావన
కోపముఁజూపక । కోరికదీర్పవే

ర్మలమానన । నిత్యకళ్యాణ
అర్భలితో నను । నాదరణ సేయవె ॥హ॥
మారిపురీశ్వర । మోక్షప్రదాయక
ారుణ్యసాగర । కాచిరక్షింపవె ॥హ॥

. భూతదయాపరా! సుజనపోషణ! మౌనిజనాభివంద్య! నేఁ
జాతకురాల భర్తమఖాల తలాగ్నిని భస్మమయ్యె న
న్నీతతి నెట్లుప్రోచెదవొ? యెట్టులభర్తనజీవుఁజేసెదో
నాతలిదండ్రిలేవనుచునమ్మితి నెమ్మదినార్తరక్షకా!

ఓపరమేశ్వరా! యోదయానిధీ! ఆర్తజనశరణ్యుఁడవును, జగత్కర్తవునగు నీవే నన్నాదరణ చేసిన యెడల నాపతిని బునర్జీవునిగాఁ జేయు పుణ్యాత్ము లెవ్వరు? ఏలైన నీవేదిక్కని నీపాదములఁ బడితిని. నీటముంచినను పాలముంచినను నీదియే భారము (అని శంకరుని పాదములపైఁబడును)

ంక—(రతివిలాపమాలించి) ఓహో! నందీ యేమిది? ఇచ్చోటనెద్దియో రోదనము వినఁబడుచున్నది. ఎవ్వరై యుందురు? కారణమేమై యుండును?

ంది—దేవా! మదనుఁడు దేవకార్యార్థమై సతీసహితముగ నిటకు వచ్చి మీనేత్రానల జ్వాలల భస్మమగుటచే నత్యంతశోకాన్వితమైన రతీదేవి తన పతిని బునర్జీవునిజేయుమని మిమ్ముఁగూర్చి ప్రార్థించుచున్నది. కావున నీపతివ్రతా శిరోమణిని బరిరక్షించుట యుత్తమము.

ంక—నందీ! నన్నింతకుమున్ను బాణప్రహారములచే బాధించి [నాకంటి మంటల దగ్ధమైన దురాత్ముఁడు మన్మథుఁడేనా? కానిమ్ము రతి నిజూచి] ఓబిడ్డా! రతీ! ఏలచింతించెదవు? దుర్నయుఁడై నీపతినా

కొనర్చినద్రోహము కతంబున వానికీ దుర్గతి పట్టినది. పూర్వక
. మెవరికి ననుభవింపక తప్పదుకదా ! ఏమిసేయుదువు ?

రతి—అయ్యో ! పరమేశ్వరా ! ఆర్తజనశరణ్యా ! నన్ను పేక్ష సేయ
పాడియగునా ? అనాథను. ఆర్తురాలను. నీవేశరణ్యమని నీచర
బులంబడిన దీనురాలను. దీనశరణ్యుండవగు నీవేనన్నాదరణము
నినయెడల నేనెట్లు జీవింపంగలను.

దరువు. రూపకము. తోడి.

పతిభిక్షంబొసంగిప్రోవు ! పరమ దయాకర ! శుభకర ॥ప
గతినీవేయని నీపద ! కమలంబుల దరిఁజేరితి ॥ప
పతులకు భర్తయెతలంప ! సకలవిషయముల నధికుఁడు
శ్రితజనమందారా ! నా ! పతిని బునరూర్తిఁజేయుము ॥ప
సుతులునల్పునేరంబులు ! పితరులుసైరించునూడ్కి
క్షితి మోరిపురీశ ; మాయపకృతులు సైఁచిపున్నింపుము ॥ప

గీ. తనయుఁడొనరించు నేరముల్ తండ్రిసైఁచి
పేర్మిమఱచెడు భంగినాప్రియునిదోష
ములకు నింతేని మనెలోన నలుకఁగొనక
పుత్త్రవాత్సల్యమేర్పడఁ బ్రోవుమయ్య.

పరమేశ్వరా ! మీారేమిచేసినఁ జేయుఁడు. మీావలన నేను
బిక్షఁగైకొనక మీాపాదములువిడుచుదాననుగాను. [అని శంక
పాదములఁబడును]

శంక—నందీ ! నావలనఁ బతిభిక్ష వడయక నన్నిమె విడుచునదికా
ట ! ఏమీా యీా సాధ్వీమణి సాహసము?

నంది—దేవా ! పరమపతివ్రతా శిరోమణియగు నీరతికిబ్రతిని:బ
శుకొనుటలో నెక్కువ పట్టుదలకలదు గావున దయయుంచి

సాధ్వీమతల్లికిఁ బతిభిక్ష పెట్టుఁడు.

క—ఓ పతివ్రతాతిలకమా! నీభక్తికి మెచ్చితి నీధవుఁడు కతిపయ దినములలోఁ బునర్జీవుఁడై నిన్నుఁ జేరఁగలఁడు. కావున విచారముడిగి కుతుకమున స్వగృహమున కేగుము.

తి—దేవా! ఇప్పటికి నేను కృతార్థురాలనైతిని. దయయుంచి నాకు సెలవొసంగుఁడు. నేఁబోయెదను.

క—నందీ! నీవీకాంతను సాఁగనంపిరమ్ము.

ది—చిత్తము

క—ఓ సనకాది సంయమీంద్రులారా! మీరు నిరంతరధ్యాననిష్ఠాగరిష్ఠులై పరతత్త్వమును భజించుచుండుఁడు. నేను దేవకార్యార్థమేగెదను.

నులు—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు)

[పర్ణశాలలో హైమవతి సఖులగు జయవిజయులతోఁ బ్రవేశించును.]

దర్వు. ఆది. పంతువరాళి.

మవతియే తెంచెను । పర్ణశాల చెంతకు ॥హై॥
మవతియే తెంచె । శంభునిగూర్చిఁ తపము
ముతోఁ సల్ప । నిశ్చలహృదయయగుచు ॥హై॥
యవిజయాభిధానలౌ । సకియలిర్వురుఁ బరిచర్యలు సేయఁగఁ జక్కనౌ
ముల రమోద్భి । నాసాగ్రమున దృక్కుంచి
యిఁ జిన్ముద్ర ధరించి । కాలాంతకుని ధ్యానింప ॥హై॥
కాలముననుండియు । హరుని బెండ్లియాడఁ । జిత్తంబులోన నెంచియు
శ్రీమోహినగర । ధాముడై నట్టిసర్వే
ుని నామంబులు । మఱవక మదిఁ దలఁచుచు ॥హై॥

మ—చెలులారా! జయవిజయలారా! యెప్పటివలెనే నేఁడుమనె

ను శంకరునిగూర్చి తపించెదను. కావునఁదదుపకరణములుసర్వము
సిద్ధముగావించితిరా?

చెలులు—చిత్తము. ఇంతకుఁబూర్వమే పర్ణశాలలో నుంచితిమి.

హైమ—[తపమునభినయించును.] దర్బా. ఆది. దేవగాంధారి.

పరాత్పరాపాలితామరా। నీలకంధరా కేలసంహారా! ॥ప
పరమపురుష భక్తపోష। పాపాళిలవిపధరా ॥ప
లింగా మంగభాంగ। యంగజమదభంగ లీలనన్నేలుగంగాధరా ॥ప
సా॥ హేసకలామ్నాయసమారాధితచరణారవిందద్వయా
సమస్తజంతుజాల సృష్టిస్థితిలయకారకా
పరాకుమానినన్నుఁబ్రోవ బఱతెంచుముశంకరా ॥ప
దుష్టశిక్షకాశిష్టరక్షకా। కష్టములెడఁబాపిప్రోవుకరిచర్మాంబరధరా॥ప
పురవిదార నగ విహార। భుజంగహార మేరుధీర
పరిపరివిధములనిన్నుఁ। బ్రస్తుతింతుమోక్షపురాగార ॥ప

దండకము:-శ్రీమన్మహాదేవ! దేవా! చిదానంద భవా! నూనప్రభావా! యతీంద్రాళివలిస్తుత్యసత్పారరాజీవ! నన్ప్రోవర వా? దయంజూడలేవా? భవత్పాదపంకేజముల్ నాహృదబ్జంబు న్నిల్పి నిత్యంబుధ్యానంబుగావించుచున్నాను హేభక్తమందార కందర్పసంహార! గోవిందబృందారకేంద్రాదిసర్వామరశ్రేణిసంస్తు తా! సాధుసంపూజితా! మేనిసంభావితా! యాశ్రితానేకసం తు! దక్షప్రజానాథశిక్షా! నిటాలాక్ష యక్షేంద్రవాహ! బల దగ్రిబాహా! సుఘాతాభ్రికేశా! మహాఘోరపాపాభ్రిఝంఝ నిలా! కాలసంహారకా! మోక్షసంధాయకా! కార్యనిర్వాహక త్ర్యంబకా! నిన్ను నేనమ్మియుంటిన్ సనుంగావుమంటిన్ దయం చుమంటిన్ సదావేడుచుంటిన్ బరాకించరాదంటి నీదాససే

టి నాకింక వేరెవ్వ రుండిరి? లేరంటి సత్పూతచారిత్రి! హేసూర్య చంద్రాగ్ని నేత్రీ! త్రిలోకైక సంస్తోత్రపాత్రీ! సురారాతిదైత్రీ! నమస్తే నమస్తే నమస్తేనమః.

లులారా! యెంతకాలము తపించినను శంభుసందర్శనముగాక యుండెఁగదా!

. పరిపూర్ణుండవలుండటీతుఁడనుచుఁ భావించి సర్వేశ్వరుఁ
హర! శంభూ! శివశంకరా! యనుచునేనత్యంతనిష్ఠాత్మనై
నిరతంబున్స్మరియించుచుంటినని యేలికా నాకుఁజూపట్టఁ డే
మఱియున్నాఁడో? కృపావిహీనుఁడయినామాటల్ మదిందల్చఁడో?

జయవిజయలారా! పసితనమునుండియుఁ బరమేశ్వరునే పెండ్లియాడవలయుననెడు నాశాబీజముహృదయతలమున నాటుకొనివృక్షమై యభివృద్ధి చెందుచున్నది కానితుదకది ఫలించునో ఫలింపదో తెలియకున్నది.

జయ—అయ్యో! వెఱ్ఱితల్లీ! హైమవతీ! నిరంతరముఁబరమేశ్వరునే భర్తగాఁదలఁచి పరమ నిష్ఠాగరిష్ఠత్వమునఁ దపించునిన్నతఁడుపఁరిగ్రహింపక విసర్జించునా? ఎందులకీయధైర్యము? ధైర్యపడుము. కృషి ఫలింపక మానదు.

మ—విజయా! నాశ్రమముగాంచి నన్ననుసయించు చున్నదానవు గాని యాసర్వజ్ఞునకు శంభునకు నేనుజ్ఞాపకముందునా? ఉన్నచో నన్నుపేక్షించునా?

య—అమ్మా! నీయాటపాటుచే నీకట్లుతోఁచుచున్నది గాని నిన్నుపేక్షించి యుండలేదు. నిశ్చయముగ నపేక్షించియేయుండవచ్చును.

మ—జయా! శంకరుడిటకువచ్చునా?

జయ—[తనలో] ఈమెశంకరుని జూచుట యెప్పుడెప్పుడని త్వరపడు

చు 'నపేక్షించి యుండవచ్చు' ననిజయ చెప్పుమాటలకు 'శంక
డు వచ్చునా?' యనియడుగుచున్నది. నేనుతప్పకవచ్చుననియే చె
దను. అట్లు చెప్పినగాని యీమె యూఱటఁజెందదు. [ప్రక
ముగా] హైమవతీ! శంకరుఁడురాక నీవు సఫలమనోరథ వెట్లగు
వు? ఎన్నఁటికేని నిన్నుగాంచుట కతఁడువచ్చును. వచ్చినిన్ను
చ్చును సందియములేదు.

హైమ—చెలులారా! శంకరుఁడునన్నుఁగాంచుటకు వచ్చునా? వ
నన్మెచ్చునా? నిశ్చయమేనా? అంతటిభాగ్యము నాకు లభించున

దరువు. అట. మారువ

వచ్చునాశంకరుఁడు నన్ గని । మెచ్చునా ॥ నెచ్చెలులారా ॥
వచ్చునాశంకరుఁడునన్ గని । మెచ్చునాతనహృదయమందునఁ
దెచ్చునాపరిణయపుమాటల । నిచ్చునాచనువించు కేనియు ॥
చూపునా నామీఁదదయఁదాఁ జేపున । నామనోహరుఁడు ॥మ
పూపతనముననుండి నేఁదన । పూజసేయుచు భక్తిశ్రద్ధలఁ
దేవదేవకుఁబుణ్యచరితముఁ । దెలిసికొనుచున్నా నటంచును ॥
నలుపునా మృదుమధురభాషణ । నలుపునా ॥ నాతోమహేశుఁడు ॥
ఇలనువెలసిన మోరిపట్టణ । నిలయుఁడగు సర్వేశ్వరుండ
ర్మిలినినన్ జెండ్లాడఁగామితి । మీఱునట్టి కుతూహలంబున ॥

ఉ. వచ్చునొ? రాఁడొ శంకరుఁడు? వచ్చిన నాదువిలాసవైఖరుల్
మెచ్చునొ? మెచ్చకుండునొకొ? మెచ్చినఁ బ్రేమఁడిమీఱనాకుఁ
న్నిచ్చునొ? యీయకుండునొకొ? యిచ్చినఁ బెండిలియాడుమాట ద
దెచ్చునొ? తేక యుండునొకొ? తెచ్చిన నేనతిధన్యనేకదా!

చెలులారా! ఆయన యభిమతమెట్లున్నదో? తెలిసికొందమన
ను, నిచ్చటఁ ద్రికాలవేత్తలగు సాధులెవ్వరును గానరారుకదా

జయ—హైమవతీ! నీయదృష్టమేమన వచ్చునమ్మా! అదిగో! నీమాటలోనే శతవర్షములు చెల్లినవృద్ధభూసురుఁడు శిష్యునొకనిఁ బురస్కరించుకొని మనదెసకు వచ్చుచున్నాఁడు. వృద్ధులకు భవితవ్యము బాగుగఁ దెలియును గావున నడిగి తెలిసికొందము.

హైమ—అహా! యేమి నాయదృష్టము? ఎన్నఁడుఁ గని విని యెఱుఁగని యీవృద్ధబ్రాహ్మణుఁ డీదినమిటకు వచ్చుచుండుట చూడ నా పుణ్యము ఫలించినట్లే యున్నది. రానిండు. శంకరాభిమత విషయ న వలనఁ దెలిసికొనవచ్చును. వృద్ధు లనుభవసిద్ధులు కదా!

[అప్పుడు కపటవిప్రవేషధారియగు శంకరుఁడు శిష్యవేషముతో నున్న భృంగిరిటునితోఁ బ్రవేశించును.]

దరువు. ఆది. పంతువరాళి.

అరుదెంచె హైమవతిచెంగటకుఁ । గపటవిప్రుఁడై శివుఁ॥ ॥దరు॥
అరుదెంచె మేనువడఁక । నడుగులు తూలిజాఱఁ
గరమున వేఁబుదండము । ధరణిపై నానుకొనుచు ॥నరు॥
గురువర్యా! యనుచుఁ జీరుచుఁ । దనవెంటభృంగి ।
పరతెంచుచుండ నవ్వుచు।
ధరణి శ్రీమోరిపుర । ధాముఁడైన శంకరుఁడు
గిరికన్య యభిమతము । నెఱుఁగఁగ మదిని నెంచి॥ ॥యరు॥

వృ॥భూ—భృంగిరిటా! అదిగో సఖ మధ్యమునఁ దారలలోఁ జంద్రుని రీతిఁ బ్రకాశించుచున్న యామెయే హైమవతి యని తోఁచు చున్నది. చూడు.

భృంగి—(చూచి) అవును గురువర్యా! యోగినివలెఁ గాషాయవస్త్రములు దాల్చి యక్షమాల వ్రేళ్ళతోఁ ద్రిప్పుచుఁ గూరుచున్న నామెయే మా కాఁగల యమ్మవారు.

వృ॥భూ—అహాహా ! ఏమి దానిసౌందర్యము? ఆదిశేషునకేని వర్ణ
 నీతము కదా.

దరువు. ఆది తాళము.

ఆహా! యీ చెలి సోయగమెన్నఁగ! నలవియె వేనోళ్ళచిలువకైనను॥ఆ
ఓహో దేహద్యుతికనుఁ గొనవి। ద్యుల్లతవలె భాసిల్లుచున్నది ॥ఆ
మోమంభోజసమానంబనదగుఁ । మోవిబింబీ ఫలమునకేన యుగ
గామవిహీనుండేనియు నీసతిఁ । గాంచినఁ బ్రైఁబడగమకించునువడి ॥నా
నాసిక తిలసుమమును నిరసించును । నడుము సింహామధ్యమునెదిరించున
హాసము పూర్ణిమాచంద్రికనొంచును । ఆకుపిపీలకా పంక్తిహసించున
కచములు భృంగసముదయము నేలును । కరములు తామరతూండ్లన
 జాలును॥
కుచములు బిల్వఫలంబులఁబోలును । గోరులుతారల లీలను గ్రాలును
 సీ. చెలియవేనలినీల జలధరద్యుతిమించుఁ
 గనులుబేడిసమీలకాంతిడించు
 సఖమోముశరదిందు చాయను బ్రహసించు
 మోవి విద్రుమరుచిమోసగించుఁ
 కలికి బాహులు పద్మకాండాకృతిని బూండుఁ
 బాలిండ్లు కరికుంభభాతిఁ జెందుఁ
 జాన పిఱుందులు సైకతోన్నతిమీఱు
 గోరులు తారలసౌరుఁ గేరు
 ముదితపాణులు కిసలయములనుబోలు
 గరితపదములు పద్మరాగముల నేలు
 నహహా ! యీలేమతో తులలైన యువతు
 లరయ నీరేడులోకములందుఁ గలరె?

మఱియు.

ఈపువ్వుఁబోఁడి సోయగము నీక్షణఁజేసిన నాఁటి మొదలుగ
తాపము నాహృదబ్జమునఁ దామరతంపరయయ్యె నింక నే
నేపగిదిన్ సహింతుఁ? జెలి నెట్టులుఁ గూడి సుఖింతు నిప్డు? తా
నేపురుషున్ వరింప మదినెంచెనొ? యీప్సిత మెట్టులున్నదో?

బ్రహ్మచారి—భృంగిరిటా! అయస్కాంతపు శిల యినుము నాకర్షించు చందమున హైమవతి సౌందర్యాతిశయము నా హృదయతలము నాక్రమించుచున్నది కదా!

శిష్య—అ. హ్హా. హ్హా. హ్హా హ్హా. హా. యేమిటండోయ్. మీ వరుస యేమియు బాగుండలేదు. పరులజడిపింపఁబోయి తానే జడిసికొనినట్లు, ఈకాంతను భ్రమింపఁ జేయవచ్చి మీరే భ్రమయుచున్నారేమి?

బ్రహ్మచారి—భృంగీ! దానికేమిగాని నేనీసౌందర్యరాశి లావణ్యాతిశయ మింతకుమున్నెఱింగినచో సర్వసంగ పరిత్యాగినై నలువు సమాధి నిష్ఠ తక్షణము విసర్జించి నిరంతరమీమెతో నిష్ఠాగోష్ఠినుందును గదా!

శిష్య—అయ్యా! ఇప్పుడు మాత్రమేమి వచ్చినది? ఇంతటినుండి మీ యిష్టము వచ్చినట్లుండవచ్చును. ఇఁక నేమియు నభ్యంతరముండదు.

బ్రహ్మచారి—అట్లయిన మనము గురుశిష్యులవలె నటించుచు మర్మము తెలియనీయక యీమె యభిమతము కనుగొందము. రమ్ము. సమీపింతము.

శిష్య—చిత్తము [అని సమీపింతురు]

జయ—అమ్మా! గురుశిష్యులు దగ్గరకువచ్చిరి. ఆరాధింపుటకురమ్ము.

ఉమ—మంచిది [అని బ్రహ్మచారిని జూచి]

గీ. భూసురోత్తమ మీపాదపుండరీక

ములకు జోహారులొనరింతు ముదముతోడ
భక్తి వేఁడితిమీరలీ భద్రపీఠి
నధివసింపుఁడు కారుణ్యమతిశయిల్ల.

వసుధామహేంద్రా! వందనములు. మీరీపీఠమధివసింపుఁడు.

వృ॥బ్రా॥—శీఘ్రమేవకళ్యాణి ప్రాప్తిరస్తు [కూర్చుండును]

శిష్యు—[తనలో] నేను చిన్నవాఁడననికాఁబోలు నన్నీమె చెలిమి
త్తెలయిన మర్యాదచేయకుండిరి. పోనిమ్ము మాగురువుగారిని
రవించిరికదా! మాకంతియేచాలును.

వృ॥బ్రా॥— దర్వు. ఆది. సావేరి.

బాలా యెవ్వరి ముద్దుపట్టివో। తెలియఁబల్కునాతో ॥
ఏలా! బాల్యంబుననే యీలీల। యోగినివై పర్ణశాల
లోఁదపించుచుంటివి॥ జాలమేల తెల్పునీదువృత్తము
చాలధన్యురాలవగుదువిఁకనో ॥బా
సత్యమేవచియింపుమసత్య మాడినఁగలుగు నత్యం
తమగుఁపాపము॥ నిత్యమీశరీరమంచుమదిలో। నెంచికాలమిట్లుగడ
చుంటివి ॥బా
ఏరికై యీకీతినిగాత్రి యఁజెందెదవో నారి విన్నవింపుమిప్పుడు॥
మోరినగరవాసుఁడై నచింతా। వీరభద్రవరదు పాదసాక్షిగ ॥బా

శా. కాంతా! యెవ్వరిపట్టివో? యెవనికై కాంక్షించినీవీగతిన్
కాంతారాంతరపర్ణశాలఁదనువుంగాసిల్ల బాల్యంబునం
దెంతేభక్తిఁదపించుచుంటివహహా! యేకాగ్రచిత్తంబునన్
వింతాయెన్ వచియింపుదాఁపకయె నీవృత్తాంతమాద్యంతము

నఖీ! సజ్జను లసత్యసంభాషణముల కంగీకరింపరుకదా గ
నీయుదంత మాద్యంతము నిక్కముపక్కాణింపుము దాసనీ

రోాభివృద్ధికలుగఁగలదు.

హైమ—[సిగ్గుచే తలవంచుకొని తనలో] సిగ్గువిడిచి నాయభి మతమీావృద్ధభూసురునితో నెట్లుచెప్పగలను.

వృబ్రా—చెలీ! సిగ్గుపడి యెదవేల? నేను పెఱవాడనుగాను నీవాఁడనే నాకడనెట్టిరహస్యమయినఁ జెప్పవచ్చును సందియములేదు. చెప్పుము పెద్దవాడనని భయమొందకుము.

శిష్య—[తనలో]అదిగో! మాగురుస్వామి మెల్లమెల్లఁగాసంబంధము గలుపుచున్నాఁడు [ప్రకాశముగా] అమ్మా! నీయభిమతము పెద్దలకుఁ దెలియక యెట్లుసిద్ధించును. చెప్పుము ఇచ్చటఁ బరులెవ్వరును లేరులే.

హైమ—చెలులారా! మీరు తెలుపుఁడు [తలవంచుకొనును]

విజయ—

ఉ. భూసురశేఖరా! తుహినభూధరవర్యుని కూర్మిపట్టియా
భాసురగాత్రి హైమవతి బాల్యమునుండియుఁదల్లిదండ్రులన్
బాసి సఖీజనంబులను బాసటఁగాఁగొని పర్ణశాలలో
వాసముచేయుచున్ శివుని వల్లభుగాఁబడయం దపించెడున్

మఱియు మీాబోటి మహాత్ములవలన నిరంతరముశ్రుతిస్మృతిపురాణేతిహాసములు శ్రోత్రపర్వముగ వినుచుఁ బఠించుచు హృదయ రాజీవమున శంకరుని నిల్పిధ్యానించుచు నాతనియందుఁగల మమకారాతిశయంబున విరహిణియై

సీ. దీర్ఘనిశ్వాసపు తెమ్మెరల్ గ్రమ్మంగ
నాగభూషా! యంచునవయుచుండు
మోహాంధకారంబు ముమ్మరంబగుటచేఁ
జంద్రచూడా! యంచు జాలిఁగుందు

తాపంబు దేహలతకు మిక్కుటంబైన
నీలకంధర ! యంచు నెగులువొందు
స్వేదకణంబుల క్షీణత స్రవియింప
నచ్యుతాశుగ ! యంచు నడరుఁ జెందు
గీ. సనిశమీఁగతి విరహవేదనలచేత
నిద్రయును భోజనముమాని నీరసించి
గడియయుగము విధంబునఁ గనకగాత్రి
ప్రొద్దుపుచ్చుచునున్నది భూసురేంద్ర !

అప్పుడప్పుడు స్వప్నంబున శంకరునిగాంచి "నాథా ! నన్ను
దనాదెదవా ! భార్యగా నన్నుఁ బరిగ్రహింపవా ? నాయందింతదయ
దయతప్పి యుండవలయునా ? " యని పలవించుచుండును. ఇదియే
యీమె వృత్తాంతము కావున    దరువు. ఆది.

ధరణీసురవర్యా ॥ ఆర్యా ॥ ధరణీసురవర్యా !
వరగుణధుర్యా ! వనధిగాంభీర్యా
పరమౌదార్యా ! పర్వతధైర్యా ॥ధ
పరిపూర్ణ కృపారసమున శంభుఁడు ! పరమ పవిత్రిను గౌరిని బ్రేమనె
పరిణయమాడునె ! భావము తెలిసెనె ! సరగున వచ్చునె సమ్మతిఁ జెంద
నె॥ హరునిమనం బెఱిఁగినచో మరుగుపరచకయే ! మెత్తఁగింపుడయా ॥ధ
పురహరుఁగాకే ! పరపురుషునిదా ! వరియింపననుచుఁ బ్రతినఁ జేసినది
గిరిజయభిమతము ! నెఱవేరెడుగతిఁ ! గరమాశీర్వాదము చేయుఁడయా ॥ధ

గీ. శంకరుఁడు హైమవతికి వశంకరుఁడయి
ప్రియముమీఱఁగ నామెను బెండ్లియాడఁ
దలఁచియున్నాఁడో ? తెలుఁపఁడో దయదలిర్పఁ
దెలియఁజేయుడు భూదేవ తిలక మాకు !

ఒకవేళ హైమవతిని వివాహమాడుటకు శంకరుని కిష్టములేనిచో నెట్లైన నీమెయందు మనసు జనించునట్లుదయయుంచి యమోఘాశీర్వచన మొకటివచియింపుడు. ఇదియేమీరుమాకుఁ జేయవలసిన యుపకారము.

వృ॥బ్రా—చెలీ! ఆశీర్వదించుట కభ్యంతరము లేదుకాని హైమవతి శంకరుని మోహించినదా? అతనిఁబెండ్లియాడునా? నిశ్చయమేనా? అహో! ఇదిచాలనాశ్చర్యకరముగనున్నదే?

శిష్య—ఆశ్చర్యమా? అత్యాశ్చర్యమా? చెప్పెడువారుచాదస్తులయిన వినెడు వారలైన వివేకవంతులు కావలయునుగదా! నవయౌవనాంగి యీమె యెక్కడ? యౌవనమంతయుఁజెల్లిన ముసలిజంగమయ్య యీతఁడెక్కడ? యీచెలిమికత్తెయేదో పరిహాసమునకుఁ జెప్పుచున్నదికాని నిశ్చయము కాదు.

వృ॥భూ—అవును శిష్యా! నాకునట్లేతోఁచుచున్నది. అయిననీహైమవతి నేస్వయముగా నడిగి దానియాథార్థ్యము తెలిసికొనెదను. అప్పుడు గాని నాకు నమ్మకముతోఁపదు. [హైమవతినిజూచి] హైమవతీ! అమలగుణసతీ! నీచెలుల వాక్యములు పరిహాసములో యథార్థములో నీనోటనే వినవలయుననియున్న వాఁడనుగావునఁ జెప్పుము నీయభిమతము.

సంవాద దరువు. ఆది. కమాచి.

గిరిజా! నుతిపాత్రి మో యమలగాత్రి విమలచారిత్రి ॥గి॥
పరమపవిత్రి పండితస్తోత్రి సరసిజనేత్రి సజ్జనమిత్రి ॥గి॥
పరగనీచెలులు పల్కినపల్కులు పరిహాసములో యథార్థంబులో
నరగఁదెల్పుమెంత వఱకుసత్యమొ సవినయముగ నాకర్ణించెదనో ॥గి॥
హైమ—వసుధామరవర్యా! యోగగుణధుర్య! సుప్రసిద్ధకార్య! ॥వ॥

వసుగిరిధైర్యా! వనధిగాంభీర్యా! యనవమౌదార్యా! యమలాచార్యా!
అసమనేత్రునమరస్తోత్రపాత్రుని । నాగహారంత వేద్యున భక్తి కేశుని
బసిలెసంబునుండి మానసంబున । భర్త గాఁగఁదలఁచియుంటినిక్క ము

వృ॥బా॥—సరియే సరియే తెలిసెను. సాంబునివలచితి వనుచేనిక్క ము
సఖులు పల్కుదానికి నీనుడులకు! సదృశమయ్యెను సకలమెఱింగితి॥గిరి

హైమ—నిజమే నిజమే నిజమే తెల్పితి నీసమీపమున నామనోరథము
నే స్తకత్రై లేలికసానిహితంబు సేవచింత్రిమోరి నిలయుసాక్షిగ ॥

ఉ. భూసురశేఖరా! యెవనిపుణ్యకథల్ పఠియించు చుందు వే
రాసమునీశు లింకెవనియంఘ్రి సరోజయుగంబు భక్తిఁబ
ద్మాసనముఖ్యనిర్జరులహర్ని శముల్ భజియించుచుందురా
భాసురచంద్రశేఖరునె భర్తగ నెంచితి మానసంబునన్.

భూసురాగ్రణీ! నాయభిమతమిట్లున్నది. ఇఁక శంకరాభిమత
ట్లున్నదో మీరమెఱిఁగింపవలయును. ఒకవేళశంకరుఁడు దయ
ప్పినన్నుపేక్షించినచో నెల్లెనఁ దమయాశీర్వచనప్రభావము వ
శంకరార్ధాంగిని గానన్నను గ్రహింపవలయును ఇదియే నాకు
రాచరించెడు సమూల్యోపకారము

వృ॥బా॥—[తనలో] ఈచెలిమనోరథము నిశ్చయముగ నాయందే
న్నది. అయినను ‹శంకరుఁడన్నింటఁగొఱమాలినవాఁ' డని నన
నేనుదూషింకొనిచుమెదను. దానసీమెమసంబేమేనిఁ జలించునేమె
చూచెదనుగాక [ప్రకాశముగా]
హైమవతీ! నీవేమిసౌఖ్యములనుభవింపవలయునని శంకరుని బెం
డనెంచితివి నీయంతటి తెలివిమాలిన దెందైనఁగాన్పించునా?

గీ. నీవునవయౌవసనాంగివి నీలకంఠుఁ
డరయజవసత్త్వములువాసినట్టిముసలి

జంగమయ్య మీయిద్దరికింగవయెటు
కుదురుఁ దెలియంగఁ బల్కు వనజకోమలాంగి ! .

పోనిమ్ము ! వృద్ధత్వమున నంగీకరించినను వానియొద్దధనమా! ధాన్యమా ? నగలా ? నాణెములా? ఏమికలవు? ఎంచిచూడవాఁడు నిక్కముగ శుష్కదరిద్రుఁడుకదా ! చూడు

సీ. కట్టగుడ్డలు లేక కరి చర్మమేనియుఁ
బులిక శాసంబేని మొలనుదాల్చుఁ
దినుట కన్నములేక దేశాల పాలయి
యింటింట బికిరంబు నెత్తికొనును
వంటకుంబిళ్ళ హరివాణ మేనియులేక
పుఱ్ఱె యందునఁ జేయుభోజనంబు
గరిసెడునూనెకు గతిలేక పెన్నెఱుల్
జడలల్లుకొని పోవపిడిచిపెట్టు
నట్టిపుట్టుబీదకరంబు వట్టనెంచి
యింటివక్కటా ! వానికేయుండనపుడు
నీకునేరీతిఁ గూర్చును ? నిన్నునెట్లు
పోషణముసేయు డెల్పుమో పూవుఁబోఁడి ?

మఱియునతఁడలౌకికుఁడగుటచే రాత్రిల యందు దిగంబరుఁడై భూతతతిఁ గూర్చుకొని శ్మశానమున గంతులువైచుచుండును. కావున నీవాబికారిని

ఉ. ఏమని పెండ్లియాడ మదినెంచితో ? యాబికిరంపుజోగినిఁ
బాములు మేనిసొమ్ములు కపాలములంచిత కంఠహారముల్
సామజశాత్రివాజినము చక్కని సాలువుకేలదండమో
వామనమూర్తి వెన్నెముక, వాహనమెన్నఁగదుక్కియెద్దగుఁ.

దరువు బేహాగ్.

తెలిపెదవినుమా! శంభునిమహిమఁ దెలియుటసాధారణమా బాపఁడ॥ తె॥
తులువతనంబుననూఱక శంభుని ! దూషించెదుసీకదిమర్యాదా
కలుషముకాదా గణ్యతకలదా జ్ఞానములేదా జడియవలవదా ॥ తె॥
త్రిగుణాతీతుఁడు త్రిమూర్త్యాత్మకుఁడు త్రిలోకవినుతుఁడు త్రిపురవిదారుఁడు
నిగమవిహారుఁడు నిర్మలహృదయుఁడు నిరుపమచరితుడు నీతికోవిదుఁడు॥ తె॥
హరివిధాతలభవునిపదశీర్షము । లరయనెంచితిరిగితిరిగి వేసరి
యరయలేక మోరినగరనిలయుని బరిపరివిధములఁ బ్రణుతులొనర్చిరి॥ తె॥

క. మును హరి విధాతృలిరువురు
ననలాంబకుఁ బాద శిరము లరయవలె నటం
చును దలఁచి తిరిగి వేసరి
కనఁ జాలక శివుని వినుతి గావించిరొగిన్.

మఱియు నాతని గుణవిశేషములించుకఁ దెలిపెద నాకర్ణింపుము

సీ. సకల చరాచర జంతుజాలంబు లె
వ్వాని కృపామహిమచే వరలుచుండు
నఖిల పురాణ శాస్త్రాగమంబులయందు
నెవ్వఁడతీతుండుగా నెన్నఁబడును
ఇంద్రాది దేవత లెవని పదాబ్జాత
ములు భజింతురు మనంబులను నిలిపి
సంయమీంద్రు లెవని సాయుజ్యమును బొంద
నెంచి నిత్యంబుఁ దపించుచుండు
రట్టి యాదిమ పూరుషు నప్రమేయు
నాగమాంతవిహారు సూనాస్త్రహరు
నాదిమధ్యాంత విరహితు నమల చరితు

నఖిల లోకేశ్వరుని దూఱుటఘుము కాదె?

మున్నాతని దూషించినదక్షుఁడును వ్యతిరేకించిన కాలుఁడు

నెట్టిశాస్తిఁబొందిరో నీకునుసదియేగతి పట్టఁగలదు. కావున నీపా

డితృమిప్పటికిఁగట్టిపెట్టి నీదారిసీవుచనుము.

వృ॥బ్రా—హైమవతీ! నేను బాల్యమునసుండియు శంకరునిచర్యలెఱిం

న వాఁడనగుటచే నీకడనిజము చెప్పుచుంటినిగాని లేనిమాటలు

ల్పించి వానిని నిందించు చుండుటలేదు. వాఁడుకడు నిర్భాగ్యుఁడు

వానికన్న నేనే వేయి మడుఁగు లధికుఁడను. నన్నల్లునిగాఁదలం

పొమ్మనకుము.

సంవాదదరువు. ఆది. కమాచి

హైమ—చాలుచాలునో బాపఁడ నీసంగతెల్ల తెల్లమాయెనిప్పుడు॥బా

కూళ తనముచేతనీవుకాలకంధరునీపిధమునఁజాలఁ గన్నులుతల కెక్కి య

దూల నాడుచున్న వాఁడవయ్యెది మేలుకాదు కీడుగల్గునిక్క ము॥చా

వృ॥బ్రా—బాలాకోపంబువలవదు ఆ పాపదారి దేవర నేనెఱుఁగుదు॥చా

ఫాలనేత్రునిపైనీకుఁ జాల మోహముంటచేనీ లీల భూషించుచుంటివ

యేలనాకు నేవిషయంబుననఁ బోలుఁదెల్పు మోరినగరనిలయుఁడు॥బా

క. చెలియా! నన్నల్లునిగాఁ
దలఁపకు నాతోడఁబునుక దాలుపుసరిరా
గలఁడా? కులశీలంబుల
బలధైర్యములందు భోగభాగ్యములందున్

మఱియు నన్ను సేవించువారికైశ్వర్య మొసంగుటయేకాక వా

యీప్సితము నిర్విఘ్నముగ నెరవేర్చెదను. కావున జన్మదరిద్రు

శంభుని వరియించి చెడిపోవక నన్నుఁ బరిణయమాడి సర్వ సౌఖ్య

ములను భవించుము. మాఱువలుకకుము.

హైమ—[చెవులుమూసుకొని] హరహరా! ఏమిది? ఈదురాత్మకుని దుర్మనమతిశయిల్లు చున్నదే?

వృ॥బ్రా—హైమవతీ వృద్ధుఁడనని సంశయించుచుంటివా యేమి?

క. సుదతీ! ననువృద్ధునిగా
మదిఁదలచి వివాహమాడ మానెకుసుమిత్రా
నిదురయునాహారంబును
వదలితపించెదు కతమున వడినెఱిసెగుకల్.

చెలీ! నేను కేవలము తపోవృద్ధుఁడను గాని వృద్ధుఁడనుగాను. పలయునేని నవయౌవనుఁడనయ్యెదను। నన్నుఁదప్పక పరిణయమాడుము చూడుము నామహాత్మ్యము.

హైమ—ఛీ! దురాత్మా! నీమొగము చూడఁగూడదు నీవావలకుఁబొమ్ము.

వృ॥బ్రా—హైమవతీ! నిన్ను వలచి పెండ్లాడ నెంచిన నన్నుఁబొమ్మనవచ్చునా? నీవుహరుని వరించితివి కదా! అతఁడు నిన్ను నిరాకరించిన నీమనంబెట్లుండునో యోచించుకొనుము.

ష్యు—వహ్వా! యీసారి మాగురువుగారు చక్కని యుక్తి పన్నినారు. హైమవతి యీపరీక్షకేమి ప్రత్యుత్తరమిచ్చునో చూచెదను గాక.

హైమ—(తనలో) ఓహో! ఈదురాత్ముని దుర్మనమంతకంతకు బలిసి పోవుచున్నదే? వీనినిచ్చట నొకక్షణమైన నిలువ నీయఁజనదు. (పైకి) చెలులారా! వీఁడు నాతపోభంగము చేయుటకు బ్రాహ్మణ రూపముతో వచ్చిన బ్రహ్మరాక్షసునివలెఁదోఁచు చున్నాఁడు. వీనిదుర్భాషణములంతకంతకు మేర మీఱుచున్నవి. కావునఁదత్క్షణమీదుర్మార్గుని వనముబయటకు సాఁగనంపుఁడు. లేనిచో నేనిచట నిల్చుట బహుకష్టము.

జయ—అమ్మా! మేమిదివఱకే యీతుచ్ఛుని నావలకుఁ బడగెంట

నెంచితిమిగాని మీ రేమనెదరోయని మీయాజ్ఞ కెదురుచూచుచు
టిమి. ఇప్పుడు తమసెలవైనది కావున నీకు వీనిని నిలువ నీయను
(బ్రాహ్మణు నుద్దేశించి) ఓరి తుంటరి పారుఁడా! నీవీస్థానమున నిలు
వలసిన వాడవుగావు. తక్షణమావలకుఁబొమ్ము.

వృ బ్రా—పోవలసినచోఁబోయెదనులే నీవునాకుఁజెప్పనక్కఱలేదు.

విజయ—ఏమీ? పోవలసినచోఁబోయెదవా? నేనునీకుఁజెప్పనవసరము
లేదేమి? అవును నయమునఁ జెప్పినకొలఁదినీకునవ్వుగా నేయుండును
(అనిగెంటుచు) సంవాదదరువు. ఆది. బేహాగ్.

నడువుమునడువుము బడుగుబాపఁడా। తడయక యడవిని గమువడి వెలువ
పడఁతికపటమును భంగముసేయఁగ। బరతెంచినరక్కసుఁడవ యెవఁడవొ

ఓరి దుముకుబాపఁడా! నీకపటవేషమున హైమవతీతపోభంగము
చేయ నిశ్చయించివచ్చిన నీగుట్టు మాకడ వెల్లడియైనదనియైన సిగ్గు
బూనక పోవలసినచోఁ బోయెదననుచున్నాఁడవా? ఆహా! యే
నీచర్య? శ్రీమాయులకులోనై మోసపోవువారెవ్వరు నింకులేరు
పెందలకడ నడువుము (అని మెడపైచేయివైచి గెంటును)

శిష్య—అయ్యో! బండ ముండలారా! బ్రహ్మరాక్షసులవలె మ
యయ్యవారి మెడపట్టి పడగెంటుచున్నారా?

అయ్యోయేమిది? పొగరుపట్టిమా। మయ్యవారినిటువడ ద్రొబ్బెదరా!
వ్రియ్యలుచేసెద మీశిరంబులిట। వచ్చిమాకుఁజిదివలుకుమాదిరిగ ॥అ

మాయయ్యవారిజోలికింకొకసారి వచ్చితిరేని మీతలలునా
డమునఁ దప్పకపగులఁగలవు. చూడుఁడు నాబాహుబలము (అ
కఱ్ఱత్రిప్పుచుఁడీకొనును)

విజయ—(తనలో) ఓహో! యీబాపన కుఱ్ఱవానిపని కూడమిగి
పోవుచునే యున్నది. వీఁడుమాతలలు పగులఁగొట్టునట (పైకి) ఓ

పసువా! దొంగకుఁజీకటి తోడగునట్లు వీరికిఁదోడైవచ్చి మమ్ము
ల గద్దించుచున్నాఁడవా?

చలియాముండీ చెనఁటి బాలకుని । శిక్ష నీయుదము చెప్పెదనిటురా ॥చె॥
పలువాపోకుమునిలువుము నిలువుము। పగులఁగొట్టరమ్ము మా శిరంబులు॥చె॥

(అనితఱిమివేయుదురు)

శిష్య—(పరుగెత్తుచు) అయ్యో! యీరాలుగాయరండలు పిశాచము
లవలె నన్ను నిలువనీయక తఱుముచున్నారు. నేనువీరికిఁ జిక్కిన
చో నాభరతము పట్టకమానరు. (పై) గురువర్యా! వన్నీవరిత్య
త రాక్షసులు బ్రతుకనిచ్చుటలేదు. మీరు వీరినెట్లుతప్పించుకొని
వచ్చెదరో యీసూత్రము మీరేతెలుసుకొని త్వరిత గతిని రండు.
నేనుపోవుచుంటినని నామీఁద నేరము వేయకుఁడు (అనిపాఱిపోవును)

వృ శాస్త్రి—ఓదుష్టవనితలారా! నన్నుబొమ్మని సెట్టుచు నాకు సహాకా
రిగావచ్చిన మచ్ఛిష్యుని బెదరఁగొట్టితిరి. నేనెటులఁ బోవఁగలను?
నాకు మార్గమున సహాయులెవ్వరు?

చేడియలారా నాతో వచ్చిన । శిష్యుని నీగతి బెదరఁగొట్టితిరి ॥చే॥
ఏడకుఁబోవుదుఁ బొమ్మనుచుంటిరి । తోడు లేక నేనడుగిడఁజాలను ॥చే॥

చానలారా! నన్నేమిచేసినఁ జేయుఁడు నాకుఁదగిన జతకుదిరినఁ
గాని నేనిచోటువిడిచెడువాఁడనుగాను(అనిచతికిలఁబడికూర్చుండును)

విజయ—ఓహో! నీకుజతకుదిరినఁగాని యిక్కడనుండి కదలవేమి? అ
ట్లయినఁజూడుము. మేమిపురమును బట్టినన్నాళ్లకు నెట్టెదము

కలికీయీతని కాలు సేతులును । గట్టిగఁగట్టియుఁబట్టి నెట్టుదము ॥క॥
తులువతనంబున మారిపుకేశుని । టూలనాడినట్టి కుట్టుచిత్తుని ॥కలి॥

జయా! త్వరితముగ నమ్మ చెట్టియొక్కపైవుపఁబట్టి యీతనినా
వలకుఁ గొంపోయివిడుతము. (అని యిరువురుఁబట్టుకొని కొంపోవుదురు)

వృ బ్రా — (రూపము మాఱి శంకరుఁడగును) ఓహా! మత్తకాశిను
రా! యేమి మీపరిమత్తచిత్తత?

ఉ. ఎవ్వనిఁ గామనంబులను నెంచి భయంబొకయింత లేకన
న్నవ్వలికేగుమంచుగడు నల్లరిసేయఁగఁ బూనినారు మీ
రొవ్వడఁగింతుదర్పులకు గొబ్బున నేఁగుఁడు చేరనైన మీ
జవ్వనితోడనా తెఱఁగుశయ్యనఁ దెల్పుఁడు మేలుకల్గెడున్

గరితలారా! త్వరితగతిం జనుఁడు. నీమనోహరుఁడు వ్రిగన్ను
య్యెనని మీగారితోఁ దెల్పుఁడు

జయ — (ఆశ్చర్యముతో) ఓహో! విజయా! యేమిది? ఈయన
కారవాక్యపరంపరలఁ దిలకింప శంకరునివలెఁ బొడకట్టుచు మనకు
యముకల్గించుచున్నాఁడు. పరిశీలింపుము.

విజయ — ఔను నిశ్చయముగ నీయన శంకరుఁడే. మనపార్వతిమనో
యముగనుఁగొనఁదలఁచి యీవృద్ధ బ్రాహ్మణ రూపముతో వ
యిన్నిపాట్లుపెట్టినాఁడు. ఇప్పటికి హైమవతిపై దయ వచ్చినది
బోలును తననిజస్వరూపమును జూపించినాఁడు. రమ్ము ఆమెకి
జెప్పుదము (అనిపార్వతిని సమీపించి) అమ్మా! యింతవఱకు బ్ర
హ్మణరూపముతో నీశ్వరనిందచేసిన మహాత్ముఁడే నీమనోహరుఁ
మేమావలకుఁ ద్రోయఁబోవనది గోఁదన నిజస్వరూపముఁ జూపి
మాకు భయము గల్గించినాఁడు. చూడుము సర్వేశ్వరుని.

హైమ — (చూచి ఆశ్చర్యముతో) ఆహా! చెలులారా! నాతప
నేఁటికి ఫలించినది. నేను ధన్యురాలనైతి (పరమేశ్వరుని సమీపిం

గీ. శరణు త్రైలోక్యపూతాయ శాశ్వతాయ
శరణు శ్రితజన పోషాయ శశిధరాయ
శరణు దుర్జనశిక్షాయ శంకరాయ

శరణుమునిజనవినుతాయ శరణుశరణు.

మహేశ్వరా! నీమృదుపదరాజీవములకుఁ బదివేలవందనములు. వచ్చియీయాకనకానన మలంకరింపుఁడు.

క—హైమవతీ! నీవత్యంతధన్యురాలవగుదువు. (అనికూర్చుండును)

మ—సర్వేశ్వరా! దర్బా. ఆది. శీల్వా

మియింపుఁడయా! సద్గుణవర్యా ॥త్రు॥ సఖులునేనుసల్పినట్టితప్పులు॥త్రు॥
మరేబాహ్మణవేషధారులై! దయచేసితిరని తెలియఁగఁజాలమికి॥త్రు॥
నుజఁడెవ్వఁడో కపటవేషమునఁ! దపముపాడు సేయవచ్చెనంచును
నమున నెంచితిఁగానిమీరలను! మాటయించుకైనఁ దెలియనైతి॥త్రు॥
రుణాసాగర ఖండితసుమశర కనకాచలధర కాలకంధరా
రణిలో మోహిపురీశ్వరమిము నే! మఱువక నిరతము స్మరియించెదుర ॥త్రు॥

క. ధరణీసురరూపముతో
నరుదెంచినవారుమీరలని యెంచక నా
గరితలనంపితిమిమ్ములఁ
పరిభవ మొనరింపనధికపాపహృదయనై

అట్టిపాతకురాలనగునాపై నలుగక క్షమింపుఁడు.

క—పరమతపోనిష్ఠాగరిష్ఠవును బరమేశ్వరభక్తిసహితవునగు నగునీపై నాకుఁగోపం బేలజనించును?

క. కలికీ! బాల్యమునుండియు
నలిపెదునీతపముచూడ సంతసమయ్యెన్
దలఁచినయభిమత మెద్దియొ
తెలుపు మొసంగెదను మిగులఁ దేజం బెసఁగన్

గౌరీ! నీవునావలనఁబడఁదగవలసిన వరమెద్దియోశీఘ్రముగ వక్కాణింపుము. అదియెట్టిదైన సమాసకరమొసంగినిన్ను నంతోషపఱచెదను

హైమ—మహేశ్వరా! తమకరుణారస పరివాహము నాపైఁబ్రవహింప నా కేకొంత గల్గునో?

గీ. ఎవనినవ్యయుఁడనిశ్రుతులెల్లఁబల్కు-
నెవని వేఁడినఁగలుషంబులవలికేగు
నెవనికృపగల్గఁదపియింతురెల్ల మౌను
లట్టి పరమాత్మ నిన్ను నేనాశ్రయింతు.

ఎవనికొఱకు నిద్రాహారములు విసర్జించి నిరంతరముఁదపించుచుంటినో, యట్టిపరమకృపాపరిపూర్ణుఁడవగు నీవు ప్రసన్నుఁడవై నన్ను వరమ్ము కోరుకొమ్మనుచుంటివి. గావున

దరువు. ఆది. సావేరి.

ననుఁబరిణయమాడుమా! నాగభూష భక్తపోష వేగమె ॥న॥
మనములోననంతతంబునినునా! మనఃప్రియుని గాఁగఁగోరుచుంటిని ॥న॥
చిన్నతనమునందుఁదాపసులెన్నరాని మీచరిత్రము విన్నవింపనేను
వినివిభాకన్న నధికులీజగంబుల నున్న వారు లేరటంచు మిము నేనన్నుతిం
చుచున్నదాన నిప్పుడు ॥న॥
దేవా తెలియఁజేసితినిదే నావాంఛితమును నిడసేయక సేవకురాల
నగు ననుఁబ్రోవ వలయునయ్య విమలప్రభావా వీరభద్రపోషక-
భావజాంతకా మరుమాటాడక ॥న॥

గీ. బాల్యముననుండి నిన్ను నాభర్తగాఁగఁ
గోరి భక్తిం బూజించుచుంటి నాకోర్కిదీర
నన్నుఁబరిణయమాడుము నాగభూష!
యిదియెనాస్వాంతమునగలయీప్సితంబు.

మనోహరా! నాకీవరమనుగ్రహించి నన్నుఁగృతార్థను జేయుమ
శంక—సుదతీ! యిదియా నీయభిమతము? అట్లైన నిదిగో వినుము

క. వనితామణీ; నీజననీ
జనకుల యనుమతిని నవీనసమ్మదమొదవన్
నినుఁబరిణయమాడెదను స
ద్గుణములుగొలువంగ దిశల ఖ్యాతిసెలంగన్

సఖీ! రేపటిదివసంబుననరుంధతీ సహితంబుగ సప్తర్షులఁగార్యనిర్వాహక విబుధులుగ నీతలిదండ్రుల సన్నిధికిఁబంపించెద. నీవుసంతసంబునసంతఃపురమున కేగుము. నేనునాయాస్థానముఁజేరుకొందును

హైమ — చిత్తము. [అనిఅందరు నిష్క్రమింతురు.]

ఓషధీప్రస్థపురము.

హిమవంతుఁడు తనకుమారులగు మైనాకక్రౌంచులతోఁబ్రవేశించుదురు]

దరువు ఆది. సావేరి

...డ లెహిమాచలేంద్రుఁడు । కొలువుకూటమునకు ॥ప॥
...డువడి మైనాకుఁడుఁగ్రౌంచుండను కొడుకులిరువురునుదన వెంబడిరా ॥ప॥
...రమపావనచరితుని । మోదినగరనిలయునిఁ బరమకారుణ్యసాంద్రుని
...రయఁగశ్రీసర్వేశ్వరునిందన । యల్లునిగాఁజేసికొనెడునుత్సాహతో ॥ప॥

హిమ — కుమారులారా! మైనాకక్రౌంచులారా!

క. మన హైమవతినిశివునకు
వనితగనడుగుటకు నేడువత్తురుమునులం
చుబల్కె నొక్కచారుఁడు
చనుదెంచరుమరలనేనిఁజరిగెదునొకదా!

మఱియు నిన్నఁబర్ణశాలలో శంకరుఁడు పార్వతికిసాక్షాత్కరించి నీజననీ జనకుల యనుమతిని దప్పక నిన్నుఁ బెండ్లియాడెదననియు రేపేసప్తర్షులను పెండ్లి పెద్దలుగా నీకండ్రిసన్నిధికిఁబంపించెదననియుఁ జెప్పి హైమవతిని సమ్మోదించి యేగెనని జయావిజయలు నాకెఱిఁగించి

యుండిరి. కావున వారువచ్చెద రేమోయని యెదురుచూచుచుంటిని.
కానియింతదనుక నెవ్వరునుగాన్పించకుండిరి. కారణమేమైయుండును

హిమ—నాయనా! కారణమున కేమున్నది? ఇచ్చటకురానున్న పె
ద్దలందఱు సమావేశమై మంచిచెడ్డలాలోచించుకొనికదా బయలు
దేరి రావలయును? అందువలననాలస్యమయి యుండవచ్చునని తో
చెడిని. కానివేఱొండు హేతువుకానరాదు.

కాంత—తండ్రివారువచ్చెదునది యీదినమనియే కదా మీకుఁదెలిసి
నది? ఇంతలో మీరింత త్వరపడియెద రేల? నూర్యాస్తమయమువఱ
కు నిదానింపవలయునుగదా?

సేవకుఁడు—[ప్రవేశించి] దేవా! జయము జయము.

హిమ—ఏమిరా సమాచారము?

సేవ—దేవా! మీదర్శనార్థమై సప్తమహర్షులరుంధతీ సహితంబు
వచ్చియున్నారు. సెలవైనఁబ్రవేశపెట్టెదను.

హిమ—సేవకా. తడయకవారిని శీఘ్రముగాఁబ్రవేశపెట్టుము.

[సప్తర్షులు ప్రవేశింతురు] దర్వు; ఆది. పంతువరాళి.

వెడలిరిన ప్రభుఘులు! గిరిరాజు చెంతకు ॥వె॥
పుడమి శ్రీవోరినగర! భుజంగ భూషణునకు
పడఁతిగా గౌరినడుగ! భావించి నంతసంబున ॥వె॥

హిమ—[మునులఁజూచి కుమార సహితముగా లేచి] మునిపుంగవు
లారా! మీమృదుపదవనజములకు వందనంబులు, మీరీమణిమయ
పీఠములనధివసింపుఁడు.

మును—[కూర్చుండి]

క. క్షేమమె? తుహినాద్రీశ్వర!
క్షేమమె సీసుతసతీసఖ స్వజనభట

స్తోమమున కెల్లఁ దెల్పును
భూమీధరవరులలోనఁ బూజ్యుఁడ వెన్నన్.

మహీధరేంద్రా! నీవు ధర్మగుణంబునను, తపఃప్రభావంబునను భువనత్రయంబునకుఁ బూజనీయుండవు కావున నీవు కూడ నాయుత్తర విష్టరంబుననుపవిష్టుండవు కమ్ము.

హిమ—చిత్తము. (కూర్చుండి యంజలి ఘటించి)

గీ. తాపసోత్తములార! మీదర్శనంబు
గలుగ ధన్యుండనైతి; గరుణమీర
విందుపుచ్చేయుటం జేసి యెల్లశుభము
లొనరెడిని నాగృహముపావనము నయ్యె.

మౌనివర్యులారా! మీ రేతెంచిన కార్య మెద్దియో యానతీయుఁడు.

వశిష్ఠుఁడు-(లేచి) అద్రీశ్వరా! మేమరుదెంచిన కార్యము నీపీనుదోయికి విందుగా వినిపించెదము గావున నీపట్టపురాణిని నీ తనయనుద క్కుంగల బంధువర్గంబును సత్వరము రావింపుఁడు.

హిమ—చిత్తము. సేవకా! సకలభూషణములలంకరించి మత్పుత్రినుదోడ్కొని రండని శుద్ధాంతకాంతలతోఁ జెప్పటకు శైలవనితల నియోగించుము.

సేవ—చిత్తము. [నిష్క్రమించి తిరుగఁ బ్రవేశించి] దేవా! యదిగో! సకల భూషణాంబర భూషితయైన మీ కుమారితెను వెంటనిడుకొని సఖజనసహితయై మేనకాదేవి చనుదెంచుచున్నది.

హిమ—సరే. రానిమ్ము.

[గౌరితో మేనక ప్రవేశించును.]

దరువు. ఆది. పంతువరాళి.

మేనకాదేవి వచ్చెను। హిమవంతుని చెంతకు॥ ॥మే

మేనకాదేవివచ్చె । నిగుడుఁగుతుకమునఁ గూర్మి
చానలుగొలువ గౌరి । సహితమ్మైగొబ్బున ||
ధారుణిమోహి పురిని । వెలసిన చింతా వీరభద్రశివ వరదుని
సారెసారెకుఁ దన । స్వాంతకమలంబునఁ
గౌరి ధ్యానించుచుఁ । గుంజరయానముతో ||

మేన—ప్రాణేశ్వరా! నమస్కారము.

హైమ—నాయనా! నమస్కారము

హిమ—పుత్రికారత్నమా! నాభూరితపఃఫలమా! రమ్ము నాదక్షి
కమునఁ గూర్చుండుము.

హైమ—చిత్తము [కూర్చుండును]

మునులు—[గౌరిని దిలకించి] ఆహా! యీమె యాకారముఁ జూడ
శ్చర్యముగఁ గాత్యాయనిఁ దలపించుచున్నది. [ప్రకాశముగ
తల్లీ! శ్రితజనకల్పవల్లీ! నీమృదుపదపల్లవములకుఁ బ్రణామము

హిమ—మునులారా! వేదవేదాంత వేదులును, తపోవృద్ధులును, వ
వృద్ధులును బ్రబుద్ధులునగు మీరీపసిబాలకుఁ బ్రణమిల్ల వచ్చునా

వసి—గిరిరాజా! యీమె బాలకాదు. సకలజగంబుల నవలీల జ
వఁజేయు కారుణ్యశీల. కావున మాకు ముఖ్యముగఁ బూజ్యులు.
పూర్వపుణ్యవశంబున నీకుఁ గుమారితగా జనించినది.

హిమ—చిత్తము. మీదయవలన నట్లే కావచ్చును. గాని మీరు
చ్చిన కర్జము వక్కాణింపుఁడు. కావలసిన వారందఱుఁజనుదెంచి

వసి—ఇదిగోఁ జెప్పెద. సావధానచిత్తులరై విని మీమీయభిప్రా
ములు వెల్లడింపుఁడు.

సీ. ఏమహానుభావుఁడు తానెల్లలోకంబులఁ
బుట్టించు రక్షించు మట్టుపఱచు

నే సచ్చరిత్రుని భూరిసంజ్ఞనిందర
తిరుగుసురాసుర నరగృహముల
నేమహాత్ముం డహంకృతిరహితులఁ జేసెఁ
ద్రిదశసంఘంబులఁ దృణముచేత
నేపుణ్యపూరుషు నీక్షించి జంభారి
వజ్రాయుధము వీడి వడఁకఁదొడఁగె
నట్టి లోకైకనాథున కంధకాసు
రాంతకున కీశ్వరునకుఁ బురాంతకునకు
భార్యగా నీకుమారిత నార్యనడుగ
వచ్చినారము హిమశైలవర్య! మేము.

ఆమహామహుఁడు నీకు జామాతయైనచో నిఖిలభువనంబుల బూజ్యుండవగుటయేకాక నీవంశంబు సర్వంబును బవిత్రంబగునుఁ కావున నీపుత్రికా మణిని పార్వతిని శంకరునికిచ్చి వివాహమొనరింపుము

హిమ—[సంతోషమున] ఆహాహా! మునిసత్తమా మీవాక్యములా కర్ణింప నాశరీరముప్పొంగుటయేకాక మనం బానందవారాశినోలాడుచున్నదికావున

దర్వు. ఆది. కమాచి.

సంతసమాయెమునివరా । నాస్వాంతము భవదీయవాక్యములువిన ॥సం॥
కంతుసంహారునకు నాకుమారిత । గౌరినిచ్చిపరిణయమొనరించెద ॥సం॥
ఏధన్యుండనైతిని మున్నెంతసుకృత మాచరించియుంటినో ॥యే॥
ఈధారుణీ మోరినగిరనిలయుం । డింపుమీఱజామాతయగునఁగ ॥స

గీ. ఈజగన్మాత నాసుతనింపుమీఱ
బాలశశిశేఖరునికిచ్చి పరిణయంబు

నేము వాడను నమ్ముఁడీ చిత్తములను
దపసివరులార ! కార్యసంధాతలార,

అజగజ్జనకుఁడు శంకరుఁడు నాకుజామాతయయ్యెదనని కోరిన
కడకు మిమ్ములఁబుత్తెంచ నేనను నుతింపక మాఱు పల్కుదునా
అపరిపంచాతీతునకుశ్వశురుఁడనయ్యెదనను నేను గడుధన్యుఁడ
యితినని పరమానంద భరితుండనగుచున్నాఁడను.

మైనా—మౌనివర్యులారా ! నాకును మహేశ్వరుఁడుభావుకుఁడగున
మిటిమీఁ జేడుకౌతుకముదయించుచున్నది.

కాళించు—ఋషిసత్తములారా! యీసాధు జనవంద్యుండగు సర్వేశ్వ
నితో సంబంధము సమకూడుట కెంతేని స్వాంతము సంతోషమ
తోఁబ్రకాసించుచున్నది.

వసి—సరే మీతండ్రికొడుకులంగీకరించితిరనుటకు సందియము లేదు
ఇఁక స్థిరపరుచుదము. [మేనకనుద్దేశించి] మేనకా ! లోకంబు
భర్త కన్యాదానము భార్యమనంబుల్లాసంబున నుండుట యుక్త
మధర్మము. కావున నీవిషయమున నీయభిప్రాయమేమి చెప్పుము

మేన—మునీంద్రులారా ! సకలజగజ్జనకుఁడగు చంద్రశేఖరునితో సం
బంధము మా బోంట్లకెట్లుసంఘటిల్లును ?

సీ. స్థావరులము మాకు దేవదేవుని తోడ
సంబంధమేరీతి సంఘటిల్లు
దేవతిర్యఙ్నరస్థావరులకుభాష
వివిధవిధంబులై వెలయుకతనఁ
బరభావము నెఱింగి పలుకఁగాఁజాలము
వ్యత్యాసమెందేని వచ్చుచుండుఁ
జుట్టఱికము జేయుచోటులిరుగడల .

భావమేకంబయి పరగనేని
సౌఖ్యమబ్బును లేకున్న సకలకష్ట
ములు ఘటించును గష్టముల్ గలిగెనేని
నాకుమారిత గాసిల్లు నాకు దాన
నోర్వలేసి సుతాదుఃఖముద్భవించు

మఱియును తంతు మహాగ్రిముఁడు ఉగ్రుఁడు రౌద్రుఁడు వానివర్యలతిభయంకరములు. మున్ను నఖముఖధారలఁబరమేష్ఠి పంచమశిరంబును గ్రూరశరధారల హృషీకేశుని మీనాదిపంచావతారములను దునిమివైచెను అవిగాక యొక్క వాగ్వ్యత్యానమున నోర్వఁజాలక మామయనియు సోమయాజియనియు బ్రాహ్మణుఁడనియుఁదలంపక వీరుండై దక్షుని శీర్షంబు ద్రొక్కిపెట్టునట్లు ద్రుంచి మృగరూపంబునఁ బరుగిడు యజ్ఞ, ఋత్విక్కులను హవిర్భాగములఁగైకొనవచ్చిన బ్రహ్మవిష్ణ్వాదినిర్జరులను దాపసగణంబును దండించెకావున నామనోహరుని చిత్తవృత్తిఁదెలిసి మేమెట్లు ప్రవర్తింపఁగలుగుదుము ఇదియునుగాక.

ఆ. వె. ఆమహామహునకు నన్నలుఁ దమ్ములు
దల్లి గురువుదైవమాప్తు
లెవరు లేక తానుయేకాకియైనిల్చి
నట్టివానికి సుతనెట్టులిత్తు

మునీంద్రులారా! యీపరమేశ్వరుని మహాత్మ్యము గనుఁగొన నాసక్తియు భయంబును నొక్కసారిగా హృదయమున నుదయించినా కేమియుఁదోఁచకున్నయది. నేనేమని చెప్పఁగలను.

రుం— దరువు. ఆది. కమాచి

నకానీకిదితగునా! మేలగునాయో ॥మే॥
నసమున నేమితోఁచదని యెంచు॥ మహాదేవునకుఁగన్న నిచ్చుటకు॥ మే॥

సకలజగత్సృష్టిస్థితిలయకా । రకుఁడుధరణీధ్రనగరనిలయుం
డకలంకుఁడువిశ్వేశ్వరుం డనీ । కల్లుఁడౌనని నేనివచింపవు ॥ మేన

మేనకా! సకలభువననాయకుఁడగు శంకరునివిషయమైనీకిట్లా
లోచింపనవసరములేదు. చూడుము.

సీ. జగములన్నింటికి జననియుజనకుఁడై
తగుశర్వునకుఁదల్లిదండ్రులెవరు?
గురువులెల్లరకుఁదాగురువౌచుఁదనరుశం
కరుణకెంచఁగ వేఱెగురువుకలఁడె?
అసురదానవమానవాళికిదేవుఁడై
తానుండశివునకుదైవమెవఁడు?
స్వయముగాజనియించి స్వప్రకాశుండయి
పరగుశంభునకు సోదరులు లేరు
కానలోకనాథుఁగారుణ్యసాగరు
నిర్వికారరూపునిత్యసత్య
చరితమించుకైన నరయక మేనకా!
యనుచుభయము జెందనగునె నీకు?

మఱియునతఁడు బ్రహ్మవిష్ణ్వాదిసురలచే దక్షప్రజాపతిని శిక్షిం
చెననినీవువింటివి. అవును వారుచేసిన మహాపరాధములు సహింప
తనకుఁబ్రియుఁడైనను జగచ్ఛాసనుండగుటచే దప్పశిక్షింపక తీరన
కాదు. కావున నామహాదేవుని సలలునిగాఁదలంపక మావాక్యము
లు విశ్వసించి సర్వమంగళమగుమీ హైమవతిని శంకరునికిచ్చి క
ళ్యాణమొనర్చుట కంగీకరింపుము.

మేన—అమ్మా! యరుంధతీ పరమపతివ్రతాశిరోమణివగు నీకుమా
రుపల్కుదునా? మునీంద్రులారా! సకలధర్మకర్మకోవిదులగు మీ

రు నన్ను నుజగాఁదలంచి తెలియక నేనింతకు మున్నాడినవాక్యము
ల కాగ్రహింపక యనుగ్రహించి మత్తనయ నీశ్వరునకిచ్చివివాహ
ముగావింపుఁడు.

—[తనలో] సరే! యిప్పటికి వీరందఱకుఁ గుదిరినది. [పైకి] అ
ద్రీశ్వరా! సర్వేశ్వరునకుఁ గన్యనిచ్చుటయందఱ కంగీకృతమైనది.
ఇఁకఁ గర్తవ్య మాలోచింపుఁడు

మ—ఆలోచించుటకేమున్నది? హైమవతీపరిణయమునకు సత్వర
ము శుభలగ్నము విచారింపుడు.

—[తనలో వ్రేళ్లులెక్క పెట్టుకొనుచు ముహూర్తము కుదిర్చి] గిరి
రాజా! రేపురాత్రి యిరువదియైదు గడియల ముప్పదియారు విఘ
డియలకు నుత్తరానక్షత్రమీన లగ్నంబునఁ జంద్రతారాబలంబు
లును దోషరహితమును జామిత్రశుద్ధియుఁగలిగి గౌరీశంకర క
ల్యాణమునకు శుభప్రదముగానున్నది.

మ—సరే. అట్లయిన మీరీముహూర్తము శంకరుని కెఱింగించి స
కల బంధుమిత్ర పరివారసహితము వివాహమునకుఁ దరలి రమ్మని
విన్నవింపుఁడు.

నులు—చిత్తము. (అని నిష్క్రమింతురు స్త్రీలుకూడ వెడలిపోదురు)

మ—కుమారా! మైనాకా! శంకరుఁడు జగత్ప్రభుండగుటచే నీక
ల్యాణమహోత్సవముఁ దిలకింప సకలప్రపంచము చనుదెంచును గా
వున విశాలంబుగఁ జిత్రవిచిత్రముగాఁ గల్యాణగృహంబు నిర్మిం
చుటకు విశ్వకర్మను రప్పింపుము. మనబంధువులకు సకుటుంబస
స్నేహిత సపరివారముగ హైమవతీపరిణయమునకు రమ్మని శుభ
లేఖలు పంపించుము. పట్టణము శృంగారముగ నలంకరించుటకు సే
వకుల కాజ్ఞాపింపుము.

మైనా—చిత్తము (అని నిష్క్రమించి తిరుగఁ బ్రవేశించి) తండ్రీ! స
లకార్యములు సిద్ధమైనవి. (అంతశంకరుఁ డఖిలబంధుమిత్రబృం
ముతోఁ దరలివచ్చును)

దరువు. ఆది. పంతువరాళి.

వెడలెఁ జంద్రశేఖరుఁడు । కళ్యాణమునకు ॥ వె
కడువడి సకలసురాసుర తాపస । గణములు తన వెంబడిఁ జనుదెంచగ
భేరీమృదంగవాద్యముల్ । కాహళరవములు । గంభీరగతిని మ్రోయఁగ
ధారుణీమోహిపురీశుఁ డపుడు వృష । భారూఢుండై వైభవ మొనఁగఁగ

శంక—నందీ! మనమోషధీ ప్రస్థపురము ప్రవేశించినారము హి
వంతుఁడు బంధుమిత్రపరివార సహితముగవచ్చి మనలఁ దోడ్కొ
నిపోవును గావున మన మాహ్వానముచేసిన బంధుమిత్రులు స
టుంబసపరివారముగ వచ్చి చేరిరో లేదో పరీక్షింపుము.

నంది—దేవా! మన మాహ్వానించిన బ్రహ్మవిష్ణుమహేంద్రాద్యమ
సంఘ ముద్వాదశాదిత్యులు, నేకాదశరుద్రులు, నవబ్రహ్మలు,
ష్టవసువులు, సప్తమరుత్తులు, షడృతువులు, సిద్ధులు, సాధ్యులు
పితరులు, మనువులు, భూతపతులుఁ, బ్రమథులు, బలివిరోచనహ
వదనసముచిబలమహాజంభజంభాద్యసురులు, భుజంగాధిపతులు ని
ను సమస్త ప్రపంచవాసులును సంతోషాతిశయమున మీ కళ్యా
మహోత్సవముఁ దిలకింపఁ జెచ్చెఱవిచ్చేసిరి.

శంక—సరే. ఇంకఁ గావలసిన దేమున్నది? బ్రహ్మవిష్ణుమహేంద
లారా! మీరు ముప్పురుఁ గార్యకర్తలుగా నుండి యీ కార్యమ
నెఱవేర్పుఁడు.

బ్ర॥వి॥మ—చిత్తము.

హిమ—కుమారులారా! చంద్రశేఖరుఁడు వృషభారూఢుఁడై బం

మిత్రపరివార సహితముగ వచ్చుచున్నాఁడు గావున మన మెదురేగి గౌరవపురస్సరముగఁ బుష్పగంధతాంబూలాదులిచ్చి తోడ్కొనివత్తము రండు.

నా—చిత్తము. నడువుఁడు.

ది—దేవా! మనలఁ దోడ్కొని పోవుట కద్రీశ్వరుఁడు సపరివారముగ వచ్చుచున్నాఁడు.

క—రానిమ్ము.

మ—(సమీపించి) చంద్రశేఖరా! బ్రహ్మవిష్ణుమహేంద్రాదులారా! మీకందఱకు వందనములు. దయయుంచి కల్యాణమంటపమునకు విచ్చేయుఁడు.

దఱు—చిత్తము (కళ్యాణమంటపము చేరుదురు)

మ—కుమారులారా! వీరందఱకు వారివారి మర్యాదలకుం దగు నాసనము లేర్పాటుచేసి కూర్చుండఁ జేయుఁడు.

నా—చిత్తము. అయ్యలారా! మీరందఱీ యాపీఠములనధివసింపుఁడు

దరు—(కూర్చుండెదరు)

ష్ణు—బ్రహ్మదేవా! ముహూర్తమాసన్నమగుచున్నది కావున నీవు పురోహితుఁడవై కార్యక్రమమునకుఁ గడంగుము.

హ్మ—చిత్తము. శంకరా! మీరీకల్యాణపీఠమునఁ గూర్చుండుఁడు. గిరిరాజా! పెండ్లికుమార్తెను సత్వరితముగ రప్పించుట కాజ్ఞాపింపుఁడు.

వు—సేవకా! సకలాభరణములు లలంకరించి పెండ్లి కొమార్తెను దోడ్కొని రమ్మని పర్వతాంగనలతోఁ దెల్పుము.

వ—చిత్తము. అదిగోఁ పెండ్లికూఁతును వెంటఁబెట్టుకొని పేరటాండ్రితో మేనకాదేవిగారు వచ్చుచున్నారు.

(స్త్రీలుప్రవేశింతురు.)

బ్రహ్మ—అంగనలారా! హైమవతిని శంకర వామభాగమునఁగూ
చుండఁబెట్టుఁడు.

స్త్రీలు—చిత్తము. (అనిఅట్లు చేయుదురు.)

బ్రహ్మ—(విఘ్నేశ్వర పూజపుణ్యాహవాచనములు చేయించి) ప
తరాజా! పరమేశ్వరుని పదప్రక్షాళనముచేసి తజ్జలముశిరంబు
బ్రోక్షించుకొమ్ము.

హిమ—చిత్తము (అని) దేవీ! సువర్ణకలశముతో శుద్ధోదకము
బసిండిపళ్లెరము నిటుతెమ్ము.

మేనక—ఇవిగో, గైకొనుడు (అనియిచ్చును)

హిమ—(పుచ్చుకొని) పరమేశ్వరా! భవత్పదములీపాత్రయందుంచు

శంక—(అట్లు చేయును)

బ్రహ్మ—(మంత్రము చెప్పును)

హిమ—(పదప్రక్షాళనముచేసి యాజలము శిరమునఁ జల్లుకొనును)

బ్రహ్మ—రాజా! గంధపుష్పతాంబూలములతో శంకరునకు వస్త్రా
లంకారము లిమ్ము (అని మంత్రము చదువుచుండును)

హిమ—[వస్త్రాలంకారము లిచ్చును]

బ్రహ్మ—అద్రీశ్వరా! హైమవతీ కన్యను ధారాపూర్వకముగా న
కాంతకునకు నొసంగుము. [అని మంత్రము చెప్పుచుండును]

హిమ—[హైమవతి చేతులీశ్వరుని చేతులయందుంచి ధారపోయు

బ్రహ్మ—సర్వేశ్వరా! సుముహూర్తము సంక్రమించినది కా
సర్వమంగళ గళమున మంగళసూత్రముఁ గట్టుఁడు. [అని మం
ముచదువుచుండ శంకరుఁడు మంగళసూత్రము కట్టును.] గి
ద్రా! వధూవరులు తలఁబ్రాలు వోసికొనుటకై మంచిముత్తె ము
తెప్పించుము.

న—ఇవిగోఁ బసిఁడిపళ్ళెరముల సిద్ధముగానే యుంచితిమి. (అని యిచ్చును.)

హ్మ—(వధూవరుల యొద్ద చెఱియొక పళ్ళెరముంచి) గౌరీశంకరులారా! మీరు దోసిళ్ళతో ముత్తెములఁగొని యొకరి శిరంబున నొకరు నింపుకొనుఁడు. (అని మంత్రము చదువును)

మ—[తలఁబ్రాలు పోసికొందురు]

లు॥మునులు—[పరమసంతోషమున నుప్పొంగుచు జయజయధ్వనులెసంగ గౌరీశంకరులకు మ్రొక్కుదురు]

[అంత జనభారముచే భూమికృంగుచున్నది.]

లు॥మునులు—[భయకంపితులయి] దేవదేవా! జనభారముచే నీయుత్తరపుదిక్కున భూమి క్రమక్రమముగా నొఱగుచున్నది. కావున మేమధఃపతనము నొందకుండ నెట్లుకాపాడెదరో మీదియే భారము [మొఱపెట్టుదురు]

క—[ఆలోచించి] ఓహో! చాలఁజిక్కు తటస్థించినదే? ఈకార్యభారమెవనిపైఁ బెట్టుదును? (యోజించి) అగస్త్యమానుఁడు కుంభసంభవుఁడుండెను గదా! [పైకి] కుంభసంభవా! నీవత్యంత శీఘ్రమున నభ్రమార్గంబునఁ జని దక్షిణదిక్కున నున్న మలయాచలంబున వసింపుము. అప్పుడు గాని భూమి సమానము గానుండదు. పొమ్ము

స్త్య—చిత్తము. (అనిభార్యతో నిష్క్రమించును. భూమిసమమగును)

లు—[చూచి] దేవాదిదేవా! మహాదేవా! భవత్సమానుఁడు కుంభజుఁడరిగిన తోడనే యెప్పటియట్ల భూమిసమమైనది. మేమువర్జితభయులమై ధన్యులమైతిమి.

హ్మ—శంకరా! వివాహాంగముగ హోమము చేయవలయును (అని అగ్నిని ప్రజ్వరిల్లఁ జేయును]

శంక—మంచిది [అని హోమముచేయును]

బ్రహ్మ—[మంత్రము చెప్పుచు గౌరీశంకరుల నగ్నికిఁ బ్రదక్షిణ
చేయించి మణిమయకాంచనసింహాసనమున నుపవిష్టులుగాఁ జేయు

అంగ—[ఆనందహృదయములతో] ఆహా! యీ హైమవతీశంకర
కల్యాణమహోత్సవము నేత్రపర్వముగఁ గాంచి కడుంగడుధన్యుల
తిమి. మఱియు నీవధూవరులు

గీ. సంతతానోన్య మైత్రిచే సంతసమున
స్థిరయశస్సులు దిక్కులఁ బరిఢవిల్ల
జగము లేలుచు దుష్టుల సంహరింపఁ
జాలు సుకుమారవరుఁ గాంచి క్రాలఁగలరు.

హైమ—[కరుణాకటాక్షముల నందఱవీక్షింతురు]

రతి—[బద్ధాంజలిపుటయై గౌరీశంకరుల కెదురుగా నిలిచి] హేప
శ్వరా! జగద్రక్షకా!

గీ. పావకాంబక! నాభర్త తానకీయ
నిటలనయనానలంబున నీల్గినపుడు
కతిపయదివసములలోన బ్రతుకునంటి
రావరంబిప్పుదయసేయఁ దగదె యీశ!

త్రిలోకాధినాథా! సంతోషస్వాంతులగు మీరీతరుణమున
రగరుడోరగ సిద్ధసాధ్యవిద్యాధర మునిగణసమక్షంబున నాథుని
దయచేసి సత్కీర్తి వడయుఁడు

బ్రహ్మ—పరమేశ్వరా! పాప మీయనాథను రక్షింపుఁడు

విష్ణు—ఈపతివ్రతాశిరోమణికిఁ దప్పక పతినిచ్చి రక్షింపుఁడు.

శంక—[నవ్వుచు] రతీసతీ! నీసాధ్వీత్వము నకు మెచ్చితిని. నీపతి
గుఁడై సర్వజనులకుఁ గానరాక, నీకొక్కరితకు భోగార్థము స

డై కాన్పించు. కావున పతితో సౌఖ్యమున నుండుము.

తి—చిత్రము. నాకదియే మహాపేరువు. దేవా! ఆపద్బాంధవులరగు మీకిదే నమస్కారించు చున్నదానను. కరుణించి సెలవొసంగుఁడు.

ంక—మంచిది.

మ—దేవా! పరమపావనులరగు మిమ్ముల జామాతఁగాఁ బడసి మే మత్యంతధన్యులమయితిమి.

ంక—శాంత స్వరూపుఁడవగు నీవుశ్వశురుఁడవై నందున సంతసము దయించుచున్నది.

బ్రహ్మాది—శంకరా! కృపాసముద్రులరగు మీ కళ్యాణమహోత్సవముఁ దిలకించి మేముఁ గృతార్థులమైతిమి.

ంక—బ్రహ్మవిష్ణుమహేంద్రులారా! మీకోరిక ప్రకారము కళ్యాణము జరిగినది. ఇఁక నేమికావలయును?

ంద్రు—భక్తవత్సలా! పరమకృపా పరిపూర్ణులరగు మీప్రాపు మాకుఁగలిగియుండ మాకేకొఱంత కలుగును. అయిన నిట్లుగాఁగాక.

గీ. విబుధలోకంబులో బాహువీర్యులుదయ
మందెదరు గాక దైత్యులహత మొనర్చ
నసురబాధలఁ జి[illegible]కయనవరతము
ముదితులై నిర్జరులు వరలెదరు గాక.

ంక—తథాస్తు. తథాస్తు. తథాస్తు. (అందఱు నిష్క్రమింతురు.)

మంగళమహాశ్రీవృత్తము.

మంగళము మౌనిజనమాన్యునకు భవ్యునకు
మారమదహారునకు గౌరీ
సంగునకు [illegible]గమవిచారునకు దుష్టదను
జప్రకరశిక్షణునకున్ సా

రంగవరహస్తునకు రౌప్యనగవాసునకు
రాత్రికరశేఖరునకుఁ భ
స్మాంగునకు భాస్కరహిమాంశుశిఖి నేత్రునకు
సద్భుతగుణాఢ్యకనిశంబుఁ.

గద్యము. ఇది శ్రీమత్సర్వేశ్వర కరుణాకటాక్షవీక్షణ సమాల
బ్ధకవితావైభవ కాత్యాయన సూత్రపతంజలిస గోత్ర
పవిత్రచింతాన్వయకలశార్ణవరాకాకైరవమిత్ర
నాగమాంబా సుబ్బరాయ సుపుత్రవీర
భద్ర నామధేయ ప్రణీతంబయి
న హైమవతీపరిణయ నా
టకము సర్వము
సంపూర్ణము.



| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 63 | 8 | డైన్నఁడేని | డెన్నఁడేని |
| 64 | 8 | పాణేశ్వరీ! | ప్రాణేశ్వరీ! |
| ... | 18 | నిర్వాహకుఁడగునే | నిర్వాహకుఁడనగునే |
| 65 | 18 | నిలులుము | నిలుపుము |
| ... | 23 | లతాంచాయుధా | లతాంతాయుధా |
| 66 | 4 | సహింకితునె | సహియింతునె |
| ... | 10 | లతాంతాసాయకా! | లతాంతసాయకా! |
| ... | 23 | జూచుట | జూచుట |
| 67 | 16 | శాపభీతినరుదెంచి | శాపభీతిచే నరుదెంచి |
| 69 | 20 | ప్రితివ్రితా | పతివ్రితా |
| ... | 22 | శాధించి(నాకం | శాధించినాకం |
| ... | 23 | కానిమ్మురతి | కానిమ్ము(రతి |
| 70 | 23 | బ్రితినిఁబతికిం | బతిని బ్రితికిం |
| 71 | 19 | నయుములఁ మోడ్చి | నయనములమోడ్చి |
| ... | 20 | కైకయిఁజిమ్మద్రి | కయిఁ జిమ్మద్రి |
| 72 | 5 | కేలసంహారా! | కాలసంహారా! |
| ... | 7 | మంగభాంగ | మంగళాంగ |
| ... | 15 | సత్ప్వర | సత్ప్వద |
| ... | 19 | మేనిసంభావితా! | మానిసంభావితా! |
| 75 | 19 | సఖిమన్యమున | సఖీజనమధ్యమున |
| 77 | 1 | మొుహాసం | మోహాసం |
| 80 | 10 | నాయందింతదయదయ | నాయందింతదయ |
| 82 | 4 | సరియేసరియే తెలిసెను | సరియేసరియేసరియే తెలిసెను |
| ... | 8 | పతియిఁ చుచుందు | పతియించుచుండు |
| ... | 24 | నట్టిమసలి | నట్టిమసలి |
| 83 | 21 | కెంచితో | కెంగితో |
| 84 | 1 | ఇటి | ఇట్టి |
| 86 | 5 | శంరుని | శంకరుని |
| 87 | 4 | వృద్ధిని | వృద్ధుని |
| 89 | 3 | చెప్పెద | చెప్పెర |
| 91 | 15 | పరిభవ | పరిభవ |
| ... | 17 | సహితవునగునగు | సహితవునగు |
| 93 | 13 | రైునాకుఁడు | మైనాకుఁడు |

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 93 | 19 | ముబలెక్క | మునుబలెక్క |
| 94 | 24 | సఖిస్వజన | సఖుస్వజన |
| 96 | 12 | గాత్యాయుని | గాత్యాతుని |
| ... | 17 | బూజ్యాలు | బూజ్యరాలు |
| 98 | 14 | కన్యాదానముభార్య | కన్యాగానము చేయునపుడుభా |
| ... | 18 | పావరులము | స్థావరులము |
| 99 | 12 | యజ్ఞ ఋత్విక్కులను | యజ్ఞంబును,ఋత్విక్కులను |
| ... | 13 | మనోహారుని | మనోజహారుని |
| ... | 16 | తల్లిగురువు | దల్లిదండ్రిగురువు |
| 100 | 8 | కరుణకొంచగ | కరునికొంచగ |
| ... | 19 | బ్రియమైనను | బ్రియులైనను |
| ... | 21 | సర్వమంగళమగు | సర్వమంగళయగు |
| 107 | 3 | నమస్కారించు | నమస్కరించు |
| 108 | 1 | పరహాస్తునకు | పరహస్తునకు |

